శ్రీ

# మందపాల చరిత్రము.

అయిదంకముల నాటకము

ఇది

ఇంగ్లీషులో షేక్స్పియర్ మహాకవి రచించిన
కింగు లీయరు నాటకమునుండి

చెన్నాప్రగడ - భానుమూర్తిచే

తెనిగింపఁబడినది.

రాజమహేంద్రవరము

యస్ గున్నేశ్వరరావు బ్రదర్సువారి
శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది

1907

---

దీనివెల 8 అణాలు

# కథాసంగ్రహము

మందపాలుఁ డను భరతఖండపు రాజునకు చండిక, మందర, సుశీలయు నను ముగ్గురు కొమారిత లుండిరి. అతఁడు వార్ధకమున రాజ్యభారము డించి సుఖం బుండఁ గోరిన కాలమున కాలమునకు చండికామందరలవివాహము లాయెనుగాని సుశీల వివాహము కాకయుండెను. శ్వేతధ్వజుఁడు చండిక భర్త వర్ధమానుఁడు మందర భర్త మాళవేశుఁడును మద్రేశుఁడును సుశీలను వరింపఁగోరి రాజస్థానముననుండిరి. అంత నొకనాఁడు రాజు తన తనయలకుఁ దనయెడఁగల భక్తితాత్పర్యంబుల కనురూపంబుగ తనరాజ్యంబు వారలకుం బంచియిచ్చు నుద్దేశముతోఁ గొలువున వారిం జేరఁబిలిచి వారియెడలఁ బొగలు ప్రేమానుబంధంబు వివరముగఁ దెలుపుమని యానతిచ్చె. కపటస్వభావ లగు చండికామందర లతిశయోక్తులతో నొండొరులం గడువంబారి యమాయికుఁ డగుతండ్రిని కనుగప్పి రాజ్యభాగములు వడసిరి. ధర్మదయాసత్యశీల యగుసుశీల తనయక్కల యిచ్చకములకు రోసి తండ్రియెడ సమగ్రభక్తివినయవిధేయతలు గలదయ్యుఁ దన్ను సహధర్మచారిణిగ వరింపఁబోవు భర్తయెడలఁ దనకుఁ గలవిధుల సూచించుచుఁ దండ్రియెడలఁగూడ ప్రేమగౌరవములు తనకు ధర్మసిద్ధము లనిచెప్పె. యథార్థవాదీ బంధువిరోధి యన్నట్లు స్తోత్రప్రియుఁ డగుతండ్రి యాగ్రహమునకుం బాత్రంబయ్యె. మందపాలుఁడును సత్యవాది యగుసుమిత్రుఁ డనుపాంచాలదండనాథుని హితోపదేశంబుల సరకుగొనక యతని నిష్ఠురోక్తులకుం గినిసి రోషావిలచిత్తుఁడై వానిని తనరాజ్యము వెలువడ శాసించి సుశీలను విడనాడి యామెకు రావలసిన మూఁడవపాలును దదగ్రజాతలపా లొనర్చి తాను కతిపయపరిజనసమేతుఁడై వారియొద్ద వంతులవారునుండ నిశ్చయించుకొనెను. ఐశ్వర్యకాముఁ డగుమద్రేశుఁడు మనవు వదులుకొనిపోయె. గుణగ్రహణపారీణుఁ డగు మాళవేశుఁడు సుశీల పాణిగ్రహణంబు సేసి యామెం దోడ్కొని తనవీటికేఁగె. ప్రభుభక్తిసంపన్నుఁ డగుసుమిత్రుఁడు మాఱువేషమున రాజు పరిచారకులలోఁ జేరెను.

చంద్రసేనుఁ డను సామంతరాజునకు శ్వేతకీర్తి యను నుదారగుణరత్నాకరుఁ డగునొకపుత్రుఁడును, అఖిలదోషకరుండై దోషాకరుఁ డనునన్వర్థనామముగల యొక దాసీపుత్రుఁడును గలరు. మిత్రభేదకుశలుఁ డగు దోషాకరుఁడు సులభస్వభావుఁ డగు తండ్రిని వంచించి యన్న నరణ్యములపా లొనర్చి తండ్రిరాజ్యంబు సర్వంబును బడయుఁ

గోరి స్వేతకీర్తి వ్రాసిన శ్లోక యుత్తరమును సృష్టిచేసి తండ్రిమనసు విఱిచి స్వేతకీర్తిని తండ్రికన్నులఁ బడకుండు మనిహితోపదేశముగఁ జెప్పివుచ్చెను

అంట మందపాలుఁడు చండికచేత నవజ్ఞాతుఁడై స్వేతధ్వజుని యనునయముల నుపశాంతి నొందక రౌద్రంబు దాల్చి చండికను శపించి మందరపాలి కేఁగ నిశ్చయించి ముందు సుమిత్రునిచే నామెయొద్దకు జాబుపంపెను చండికయు నట మున్న కుక్షింభరుఁ డనుతనపరిచారకుని యుత్తరమిచ్చి మందరకావు కంపెను జాబులతో విరివృయను జేసుకొను మందరయు వర్ధమానుఁడును చంద్రసేనుని నగరమునకుఁ బోయి యుండిరి చంద్రసేనుఁడు వారితో సంప్రతించి స్వేతకీర్తి శరంబుఁ ద్రెంచి తెచ్చినవారికిఁ బారితోషిక మిచ్చెదనని చాటఁబంచెను స్వేతకీర్తి యున్నతవేషముఁ గైకొని పురమునకు స్వేలియై చెట్లుఁ బుట్టలుపట్టెను కుక్షింభరుఁడును సుమిత్రుఁడును చంద్రసేనని నగరు ముంగిటఁ దారసిల్లగ వారిలో వాక్కలహము పుట్టి చినికిచినికి గాలివానయై నంతట సుమిత్రుఁడు కత్తిదూసి కుక్షింభరునిపై కడరెను అంత నాసంక్షోభము విని మందరయు వర్ధమానుఁడును పైకివచ్చి జాబు లంది సుబంధునియందు నేరము మోపి వానిం బొండకొయ్య నుంచిరి అంతఁ గొంతతడవునకు రాజును విదూషకసమేతుఁడై వచ్చి చంద్రసేన మందిరద్వారమునఁ జేరినవాఁడై పరిచర పరిభవమూలమునఁ దనకుఁ గలిగిన యవమానమునకుం గోపోద్దీపితుఁడై కూఁతునకు నల్లునకుఁ దనరాక నెఱిఁగింపఁ బుచ్చినవారలు మిషవెట్టి జాగుసేసె రొట్టకేలకు వచ్చి సుమిత్రుని బంధ మూడ్చిరిగాని రాజు నెడ నాదర మించుకయులేక భాషింపఁజొచ్చిరి ఇంతలో చండికయుఁ జేటులవలన నొకరికొకరు తోడై తండ్రి పరివారమును వ్రాస్యపఱుచు ప్రసంగములో నొకరినొక రతిశయించి పలుకుచుఁ గడ కాముదుకని మతిగలఁచి యాలని వదల్చుకొను నుపాయ మొనర్చిరి సుమిత్రవిదూషకమాత్ర పరిచరుఁడై రాజు పురమువెడలి తలవాయ విసరు గాలివానలో నడిరేయియైనం దలదాఁచికొన నెలవొసంగని బట్టబయట నివసించి యుండవలసె అప్పడున్నత్తవేషధారియై యందంప నల్లాడు స్వేతకీర్తి వీరికి జతపడియె స్వేతకీర్తి యున్మత్త ప్రలాపములతోడను విదూషకుని చాటూక్తులతోడను చిత్తాపస్మారి మందిన రాజునకుఁ గాలక్షేప మగుచుండెను ఈయవస్థలో సదయాంతరంగుఁ డగు చంద్రసేనుఁ డనుకంపాయత్తచిత్తుఁడై రాజు నొకకుటీరముఁ జేర్చి కొంతయుపచారము సలిపెను ఇంతలో వర్ధమానసితధ్వజులకుఁ గలహములు పొసఁగెను రాజు దురవస్థయు నల్లర వైషమ్యమును చాకులవలన నెఱింగినవాఁడై నీతివిశారదుం డగు మాళవుండు ప్రభుభక్తి సంపన్నుఁ డగు సుమిత్రచంద్రసేనుల యాలోచనతో వర్ధమానశితధ్వజుల గెల్చి రాష్ట్రము రాజునకు

సమర్పించువాఁడై నిగూఢముగ సేనలఁగూర్చి యుద్ధసన్నద్ధుఁ డాయెను చంద్రసేనుఁ డీ వ్యవహారమునందుఁ దనకుఁ గల జోక్యమును రాజునకుఁ దా నొనర్చిన యుప చారములు నెప్పటి వప్పుడు దోషాకరునితో మర్మము విడిచి దెలుపు చుండువాఁడు. నాస్తికుఁ డగు దోషాకరుఁడు పితృసర్వస్వలోలుఁడై భ్రాతృద్రోహ మునకుఁ దోడు పితృద్రోహమునకును సమకట్టి తన రాజభక్తి యుట్టిపడఁ బలుకుచు నీరహస్యము లెల్ల మందరావర్ధమానులకుఁ దెలిపి వారి నిష్ఠురకృత్యమునకుం బురికొల్పి తాను చండిక యింటి కేఁగె చంద్రసేను నింట నతిథులయ్యు దాక్షిణ్య మెంచక యాక్రూరకర్ములు వృద్ధుఁ డగు చంద్రసేనుని గ్రుస్సి తోడి యిల్లు వెడల నడచిరి ఈదారుణకృత్యముఁ జూడనోపక చంద్రసేనుని పురజనుఁ డొకఁడు వర్ధమానునితోఁ గలహించి వానియొంట గాయము నాటి తాను మందరచె నిహతుఁడయ్యె తదనంతర మావర్ధమానుఁ డావ్రణకారణమున నీల్గెను ఆదివఱలోనే పాడెవప్పి చండికామందరులతో ననుచిత రహస్యవర్తనలకుం జొచ్చిన దోషాకరుఁడు వర్ధమానుఁడు గతించినతోడనే మందరను సర్వకార్యధురంధ రుఁడై చండికకు మందరియుం దగూయాభివర్ధనం బొనర్చుచుండె చండికయు నిజభర్తృ వధోపాయములు చింతించుచు దోషాకరునకుఁ దనహృదయ మెఱింగించుచు కుక్షింభరని వలన జాబు లంపుచుండె

దిక్కుమాలిన చంద్రసేనున కున్మత్తవేషధారియైన శ్వేతకీర్తియే దేదోడై తన సాంత్వనవచనములతోడను తంత్రకౌశలము చేతను, అతని యాత్మహత్యోద్దేశముల నివా రించుచుండెను ఇంతలో మందరయాజ్ఞానుసారముగ చంద్రసేనుని శిరముఁ ద్రుంప కుక్షింభరుఁడు సమీపించుటయు శ్వేతకీర్తి వానిం దెగటార్చి వాని కంచుకాంతర్గుప్త మగుచండికజాబులుఁ గైకొని చూచి చండికాదోషాకరుల ద్రోహము బయల్పఱచి శిత ధ్వజునింగాయు నుద్దేశముతో జాబులు వానికం దఁజేసి దోషాకరుఁడు తన ద్రోహ మొప్పు కొననినాఁడు తనకై భేరిమ్రోయించిన ఖడ్గపాణియై వచ్చి యంతయు బుజువు చేయిం చ్ఛెదనని చెప్పిపోయెను

మాళవుఁడు కార్యాంతరవ్యాపృతుఁడై తనపీటికి మరలిపోవలసి వచ్చినందున సుశీల తనసేనాని యాధిపత్యముక్రింద సేనల నాయితంబుసేసి తండ్రిని వెదకి కాంచి తగుసంరక్షణలోనుంచి బయలువెడలయుటయు శత్రుసేన శ్వేతధ్వజ దోషాకరుల యాధి పత్యమున యుద్ధసన్నద్ధమయ్యె శ్వేతకీర్తి తండ్రి నేకాంతస్థలమున సురక్షితుఁ జేసి ధర్మ పక్షమవలంబించి పోరఁ జేరె దైవములను చాలమ్మిం జేసి మాళవసేన పరాజితమగుటయు సుశీల మందపాలులు బందీకృతులై దోషాకరునిచేతఁ జిక్కిరి దోషాకరుఁడు వారలం

దనసేనాధికారి యధీనముచేసి రహస్యవధోపాయం బుపదేశించిపుచ్చె ఇంతలో దోషాకరునకును శ్వేతధ్వజునకును వాగ్వాదము పొసఁగిన శ్వేతధ్వజుఁడు శ్వేతకీర్తి యొవఁజేసిన జాబులలోని దుర్గుణము లొగ్గడించి దోషాకరునియందు దోషమారోపణసేసి ద్వంద్వయుద్ధమున దాని నిర్ధారణసేయువానికై జేరఁబోయించెను ఈలోపల చండికా దత్త విషకారణమున మందర ప్రాణములు వాసెను చండికయుఁ దన దుష్కృత్యములుఁ బయల్పడినందులకై లజ్జాపరిభూతమానసయై కత్తివాతఁబడి మడిసె జేరఁబోత విని శ్వేతకీర్తి దోషాకరునితో నెక్కటికయ్యమునకుం గట్టాయితుండై తండ్రికి రాజు దురవస్థదెల్పి తన్నాతింరింపుమటయు నమ్ముదుఁగని హృదయమలిసిపోయె శ్వేతకీర్తి దోషాకరుంవలపడి యసిధార నాతని నేలంగూలనేసిన నాతఁడు ప్రాణావశిష్టుండై తన ద్రోహమెల్లఁ గడవెట్టక బయటవెట్టినతోడనే సుశీలామందపాల ప్రాణరక్షకై శ్వేతకీర్తి యుఱుకుతఱికి సుశీల పనిదీఱెను దోషాకరుఁగును ద్వంద్వయుద్ధమున శ్వేతకీర్తిచే నందినగాయమున నచిరముననే యుసుఱువిడిచె అంతలో రాజును జింతచే జివికిముగ్గిన పండువలె నేలవ్రాలుటయు సుమిత్రుఁడు వైరాగ్యముగొని పని వినియె అంత శ్వేతధ్వజుఁడు శ్వేతకీర్తి కాతని పూర్వపదంబొసంగి తాను రాజ్యభారమువహించి మృతులైనవారి కుచితక్రియలొనర్చి దుష్టశిక్షాశిష్టరక్షణపరుఁడై ప్రజాపరిపాలనంబు చిరంబొనర్చె



# ఈనాటకమునందు వచ్చుపాత్రములు

## పురుషులు

మందపాలుఁడు—వృద్ధుఁడగు వరతఖండపు రాజు

శ్వేతధ్వజుఁడు—మందపాలుని మొదటియల్లుఁడు

వర్ధమానుఁడు—మందపాలుని రెండవయల్లుఁడు

మాళవేశుఁడు— } సుశీలను వరించుటకై కొల్వాన వచ్చియున్న
మద్రేశుఁడు— } యిద్దరు రాజులు

సుమిత్రుఁడు—పాంచాలదండనాథుఁడు

చంద్రసేనుఁడు—ఒకసామంతరాజు

శ్వేతకీర్తి—చంద్రసేనుని పుత్రుఁడు

దోషాకరుఁడు—చంద్రసేనుని దాసీపుత్రుఁడు

విదూషకుఁడు, వైద్యుఁడు, సచివుఁడు, పరిచారకులు, చారులు, భటులును

## స్త్రీలు

చండిక— }
మందర— } మందపాలుని కొమార్తెలు
సుశీల— }





# మందపాల చరిత్రము.

## రంగము—భరతఖండము.

చ. ఎవఁడు గణింపఁగానలవియీని యజాండము లెల్లఁద్రిప్పువాఁ
డెవఁడు తదాశ్రితంబులగు నెల్లచరాచరమోలిమన్పువాఁ
డెవని యలంఘ్యశాసనము లించుకయేనియు మీఱనేర వీ
భువనము లన్నమస్తములగు భూతచయంబును వాని నెంచెదన్

## ప్రథమరంగము—మందపాలుని నగరు

[సుమిత్రుఁడు, చంద్రసేనుఁడు, దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు]

సుమి—వర్ధమానునికంటె స్వేతధ్వజనిదెస వన ప్రభువునకున్కువ మక్కువగలదని నాకుఁదోఁచెడిని.

చంద్ర—ఇదివరలో మనమందఱ మట్లే యనుకొనచుంటిమిగాని, నేఁడు తూఁచినట్లు లేశమేనియు వ రలేకుండ రాజ్యముఁ బంచియిచ్చినరీతిఁ జూడ, నాయన కెవరియం దధికాదరముఁ గలదో తెలియ వలనుపడకున్నయది

సుమి—ఇతఁడు మీ యాత్మజుఁడే కాఁడా?

చంద్ర—వీఁడు నా సంరక్షణలోనివాఁడేయైనను, వీనిం బుత్రుఁడని యొప్పికొన నాహృదయ మొల్లకయున్నది నాయెడఁ గలలోపముఁ బొడగనఁగల్గితిరా?

సుమి—లోపమెట్టిదైనను ఫలమింత యాదరణీయంబగుటంజేసి యుక్తముగనే దోఁచెడిని

చంద్ర—నాకు ధర్మపత్నియందుఁ గల్గినవాఁడు వీనికంటె నొక హాయన మెక్కువవయసు వాఁడొకరుఁడుఁ గలఁడుకాని, నాకు వానియం దింతయాదరము లేకున్నయది కోరిపడసినవాఁడు గాకున్నను, తల్లి సౌందర్యగరిమంజేసి వీనిం బుత్రుఁగా నేలందగు దోషాకరా! నీవీమాన్యచరితు నెఱుంగుదే?

దోషా—అయ్యా యెఱుంగను

చంద్ర—పాంచాలదండనాథుఁ డగుసుమిత్రుఁ డితని మత్ప్రియసఖుంగాఁ దెలియుము

దోషా—వందనమాచార్యా

సుమి—మీబోంట్ల ప్రేమకాస్పదుండవై యాయుష్మంతుఁడవై వర్ధిల్లెదవు గాత!

దోషా—శ్రద్ధచే మీప్రేమకుం బాత్రత వడసెదను

చంద్ర—వీఁడు తొమ్మిది సంవత్సరములనుండి పరదేశవాసము చేసివచ్చినవాఁడు. వెండియు నిలువెడలనై యున్నవాఁడు

[మందపాలుఁడు, వర్ధమానుఁడు, శ్వేతధ్వజుఁడు, చండిక, మందర, సుశీలయుం బరిచారకులునుం బ్రవేశించుచున్నారు ]

మంద—ఓయి చంద్రసేనా! నీవును దోషాకరుఁడును బోయి మాళవప్రదేశములం బరివేష్టించి యుండుఁడీ

చంద్ర—దేవర యాజ్ఞానుసార మొనర్చెదను

(చంద్రసేన దోషాకరులు నిష్క్రమించుచున్నారు)

మంద—ఉ క్రమ్మదె శరీరపాటవము, మందటికెల్ల న్నిపుడెచ్చె లెల్ల, నా
డెందము రాజ్యభారమిఁక డించి సుఖంబున నుండఁగాఁ గడుం
దొందఱ సేయుచున్నయది, తోడనె చిన్నలపై భరంబు మో
పందగుఁ ద్రోవ చూచి, యిదప న్నిదె పొందగు పుణ్యకర్మముల్

గీ అట్లు గావున నాకూర్మి యల్లురైన
వర్ధమాన, సితధ్వజవర్యులార!
అనుఁగు తనయులకే నిచ్చు నరణములను
ముందు సందియ మేమియుఁ జెందకుండఁ
బూని వివరింపఁగా నిచ్చ వొడమె నాకు

క మాళవప్రదేశులను, సు
శీలం బడయంగఁ గోరిచేరి కొలువునం
జాలదినంబులు వేచిరి
వాలాయముఁ జేయవలయు వరనిర్ణయమున్

ఉ కూర్మితనూజలార! యిఁకఁ గోరికల న్విడనాడి యెంతయు
న్నిర్మల చిత్తవృత్తిమెయి నిత్యసుఖస్థితి నందఁగోరి మీ

కర్త్రిలిఁ బెంచియిత్తు భువి నందులకై వివరించి చెప్పఁడీ
మర్మములేక ముష్వురను మానుగ నాదెసఁగల్గు కూరుముల్

గీ. కన్నమోహంబుఁ గూర్మియుఁ గలసి యమరు
తావున గరిష్ట భాగంబు దగులునట్లు
పంచియీఁదగు గావునఁ బలకవమ్మ
తొలుతఁ దొలుపట్టి, చండికా! తోడరి నీవు

చండి—శా. తండ్రీ నాయెడఁ దందడించు మమతల్లభ్యంబు భూమండలిం
దండ్రుల్బిడ్డలయందు నెందును గనంగాఁ బోవకుం డిడ్డరే
వాండ్రుం దండ్రుల పట్లనేయురవినే వాక్రువ్వ నానాలుకల్
పండ్రెండైనను జాలవైన వివరింపం బూనెదన్శక్తిమై

ఆ. కన్నదోయికంటె, కొంతయౌవన రూప
గుణవిలాసములను గొమరుమిగిలి
యఖిలగౌరవముల కాస్పదంబై యొప్పు
బ్రతుకుకంటె, భాగ్యవితతికంటె,
నిఖిలకామ్య సౌఖ్యనిచయంబుకంటె, నో
యార్య! నిన్గణింతు నతిశయముగ
పలుకులిన్ని యేలఁ బాయనినాకూర్మి
యింతయనుచు నిశ్చయింపరాదు.

సుశీ—(తనలో) సుశీల యేమిసేయంపగు సౌహార్దము హృదయాంతర్గతముగ్గ నుంచి మౌనముద్రం దాల్పనగు

మంద—(పటము గైకొని)

ఉ. కాటుకకొండ చాలుగతిఁ గాఱ్కొను కానన పఙ్క్తులన్న మా
పాటల హృద్యశాద్వల విభాసిత పార్శ్వములౌ స్రవంతులన్
హాటక గర్భితస్థలుల నచ్ఛజలాఢ్య సరోవరంబులం
బాటిప్రాజ్య రాజ్యమిది తత్పరిపాలితమై చనంగగున్

గీ. కాన నీనాల్గు హద్దుల గ్రాలుపుడమి
భర్తయును నీవు సంతతివారు నెలమిఁ
జేరి భుజియింపుఁ డాచంద్రతారకముగ
ఇఁకను నీక్షేమ, మందరి! యెఱుఁగపలతు —

మందరి — ఊ వెండియుఁజెప్ప నేల? మునువిన్న యుదంతము నింతదాకయా
చండిక యేమి దెల్పె నది సర్వము మద్హృదయాంతరస్థమై
యుండినదయ్యె, దీన మఱియొండు విశేషము, నిన్నుఁబాసినం
బండువులెల్ల బాములగుఁ బ్రాణములు న్బరువౌ మదాత్మకున్

సుశీ—(తనలో) సుశీలా! ఇఁకఁ బేదఱికమే నీపాలు అయినను నేమి? నా ప్రేమవాలుకను దనుభావమందియు హృదయమునఁ బుష్పలతనే వహించుచున్నయది

మంద—సీ ఉదయచరమాద్రిమేఖల లారసి నాడు
నాజ్ఞ వర్తిల్లుచున్న యీయవనిలోన
నీవు మూఁడవపాలగు నీవిశాల
ధాత్రిఁ బాలింపు మాపుత్రపౌత్రకముగ

గీ తనయావర్గమునం దుదిదానవయ్యుఁ
గాంత! గుణరూపముల నగ్రగణ్యవౌ సు
శీల! నాపాలిభాగ్యము! చెప్పుము నీదు
నుల్లమునఁ బాదుకొను కూర్మిసెల్ల నిపుడు

సుశీ—ఏమియునులేదు తండ్రీ!

మంద—ఏమియునులేనిచో నిచ్చునదియు నేమియు నుండదు

సుశీ—ఆహా! నే నెంత యదృష్టహీనను! ఎదనున్నది పెదవులకుం జేర్పనేరను తండ్రీ! నిన్నెంత ప్రేమింపనావిధియో నంతవట్టున కించుకేనియు నెక్కువ తక్కువలు లేకుండ నిన్నుఁ బ్రేమించెదన

మంద—ఏమేమి? సుశీలా! నీపలుకుల నిలకడగా విచారించి, యించుక సవరించికొనుము లేనియెడల, నీయాదృష్టం బదృశ్యంబయ్యెడు.

సుశీ—తండ్రీ!

క కనిపెంచి విద్య బుద్ధియుఁ
జనవు మెయింగఱపినట్టి జనకుఁడ వటుగా
వుననినుఁ గొల్వఁగవలదే
వినయమునను బరిమభక్తి విశ్వాసములన్

గీ తలపు లెల్లనునీయంద తగిలియున్న,
మగలచేటికి వసనిటీమగువలిట్లు

వల్కినంతనె మాటలు పాటిసేయ
నగునె? నామాట దెల్పెద నవధరింపు||

గీ అవనిని చెట్టవట్టుమన్నట్టిఘనుఁడు
దక్కఁగొను నామహృదయంబు చక్కనగము
నేను పీరలవలెఁ దండ్రి కెల్ల కూర్మి
యును నొసంగఁగఁ జెంగ్లియాడను నిజంబు

మంద—అగుఁబో! ఇది యెల్ల నీహృదయ పూర్వక మేకదా?

సుశీ—అల్లే తండ్రీ

మంద—ఈ లేతవయసేడ? ఈ ధాతిగుండెయేడ?

సుశీ—తండ్రీ! నిజమాలోచించిన నింత లేతవయసున నీసత్య వాదిత్వమేడ? యనందగు

మంద—కానిమ్ము నీసత్యవాదిత్వమే నీకరణముగానిమ్ము

వ భువిపీరంబులు వహ్నివాయువు నభంబుం గెర వాజ్జాతబాం
ధవులు వ్యాప్తులుగా న్మోహమయిబంధం బొక్కటం ద్రెంచి యీ
యవనీనాథసభాంతరం బున నవశ్యంబేగు నేఁడీతనూ
భవముర్త్యాసముఁ బోవఁ ద్రోచెద ననల్ప ప్రీతిసంధిల్లగాన్

గీ ఇంతనుండియుఁ దనకూన లేచ్చి ద్రింగు
వ్యాఘ్రియును, ధాత్రిమనుజాలనాఁకటితమి
మెనవురక్కసిమూఁకయు, మేలు నాకు
నక్షమహృదయవు నీకంటె నవనిలోన!

సుమి—మహాప్రభూ —

మంద—సుమిత్రుఁడా! నీవూరకుండుము రోషభీషణంబగు కేసరి జాతికిం దోలంగుము నేనీకృతఘ్నను నాబహిఃప్రాణముగఁ జూచుకొనుచు నిది వన్నె మువ్వనఁ గమువం బెట్టునని కొండంత యాసతో నుండినాఁడ నేఁటితో నది యెల్లయుంజెల్లె అట్లగుట నాకీతనువుర చిత్తశాంతియుండిచె ఎఁదురా హాహాకారమన? మాళవ మద్రదేశులఁ బిల్వనంపుము వర్ధమాన సితధ్వజులార! ఇదివరలో వాద్రియుతవయుల కొనంగిన యరణంబులతో నిమాఁడవపాలునం గూర్చి యనుభవింపుఁడు. సత్యవాదిత్వమని

శా ర్ధమించెదు తపగర్వమే యీసుశీలం జెందుఁగాక! గజతురగాది మదీయసమస్త రాజ్యసంపదలను నేటినుండియు మీయధీనములు సేసెద శతపరిమితపరిజనసమేతుండనై రాజచిహ్నమాత్రావశేషుండనై వంతులవెంబడి మీయుభయులమందిరంబులం బ్రొద్దుపుచ్చెద దీనికిం బ్రమాణంబుగా నీమకుటంబు మీరుభయులునుం బంచికొనుండు

(మకుటము నిచ్చుచు)

సుమి—గీ అనఘ! ప్రేమింతుసిన్న మజ్జనకునట్లు,
ప్రభునిగా భక్తిఁజూచెద, స్వామిఁబోలె
సేవలొనరింతు, నాపాలిదైవముగతిఁ
గొల్తుమదిలోని కోర్కులు కొనలు సాగ

మంద—విల్లెక్కుడెంబడియె నంపకోలకగ్గంబుగాకుము

సుమి—

సీ పడనిమ్ము విశిఖంబు బెడదంబుగాముట్టి యెదగాడఁజొచ్చినఁ గదలనేను
స్వామిచిత్తమెకప్డు స్వాస్థ్యంబువీడిన భృత్యునంద వినయంబే గణఁబు
తతవివేకము మఖస్తుతులపాలుగఁజేయు ప్రభువు తప్పలు దిద్దవలదె భృత్యుఁ
డట్లుగావున విను మప్రియంబనకేను వాక్రుత్తునిటఁగల వాస్తవంబు
నీదుచిన్నతనయ నీకన్నసంతాన
మువ సమగ్రభక్తివినయ మహిత,
నిందుకుండ తోణకకుండుట యెఱుఁగవే
యేలనిచ్చకముల బేలవైతి?

ఆ వె అయిన నెమ్మనమున నాలోచనముసేసి
యీసుదక్కి నీదుశాసనంబు
ద్రిప్పకోలుమేలు దీనవసర్థంబు
వాయువేగిరంబు పలుదుసుమ్ము

మద—సుమిత్రుఁడా! ఇంకనం బ్రేలెదవేని ప్రాణఁబుఁకుం బాసెదవుసుమీ.

సుమి—క నాయసువు లివెల్లప్పుడు
నీయొద్దంబూటకాలె నీకరివిజయి
శ్రీయొనగూర్పఁగ నవి నీ
కై యే విడువంగ వెఱువఁగర్దంబుతలిన్.

మంద—ఛీ! పొమ్ము! నా కనులం బడకుము

సుమి—లెస్సగ నరసితేని నాహితంబ కర్జంబుగాఁ దెలిపెదవు

మంద—నిన్ను సృజించిన దేవుని యాన

సుమి—ఓయిరాజా! నీవేల యిట్లు నిర్నిమిత్తముగఁ బ్రతిజ్ఞలు సేసెదవు?

మంద—ఓరీ! కృతఘ్న! భక్తిహీన! (కత్తిదూసి)

వసి — దేవా! శమింపుము

సుమి—వైద్యునిం జంపి రోగమును సత్కరించికొనము. నీశాసనము మరల్పలేని నాకంఠమునఁ గొన యూపిరియున్నంత దనకను నీచేయు నకార్యంబు వలదని వచింపక మానను.

మంద—సీ. వినుమూఢ! ప్రభుభక్తి వీసమైన నుఁదుమదిగల్గ నేని యిమ్మాడ్కిఁ బూని
సమయులంఘవమును సలుపంగ నీవిట్లు నన్నోడఁబలుకంగఁ జనునె తెలివుర?
ఆడితప్ప నేర్తురె మానధనులు మూర్ధాభిషిక్తులు నగు నవనిపతులు
తెలిసి ప్రల్లదములు పలికితి గాన నారాష్ట్రంబు వెల్వడి బ్రతుకఁగనుము
నేఁడు మొదలు దీని కేడుదినంబులు
గడువు వెట్టెద నది కడచనంగఁ
దడసి నీవిచటను బొడఁజూపెదేని నీ
మేనఁ బ్రాణములకు మానుమాస

సుమి—అధిపా! సెలవొసంగుము. నీవీచందమైన నాకీదేశమే పరదేశము అన్యదేశములే వాసయోగ్యములు

(సుశీలతో) త్రికరణశుద్ధిగ ధర్మచారిణి వగు నినుం గరుణామయుండగు పరమేశ్వరుఁడే పాలించుఁగాత!

(చండికామందరలతో) మీమాటల యౌదార్యమును సదృశక్రియలం దేటపఱతురు గాక. ఇంతటినుండియుం బ్రపంచమునందియ్యనిమాటలనే నెయ్యంపుఫల మెల్లయుం జేకూరెడు గాక. ఇదె సుమిత్రుఁడు మీయందఱ యనజ్ఞయుం బడసి దేశాంతరమున కేఁగుచున్నాఁడు

[చంద్రసేనుఁడు మాళవమద్రేశులను వారి యనుచరులను గూడి తిరిగి ప్రవేశించుచున్నాఁడు ]

చంద్ర—మహాప్రభూ! వీరే మాళవమద్రేశులు

మంధ— మద్రాధిపా! నాకూఁతుం బరిగ్రహింప నేపాటి వరణంబు గావలయునో తెలియవలతుం జెప్పుమా

మద్రే—ఓయుదారచరితా! నీ విదివరలో నేర్పఱచిన పని కధికం బపేక్షించు వాఁడను గాన అంతకుం గొదువసేయ నీవును దలంపవే కద?

మంధ—ఓ నరపాలోత్తమా! ఇది నాహృదయంబునకుం బ్రియంబై యుండినంత కాల మట్లే యూహించుచుంటిని గాని యిప్పుడు దీనియం దట్టిగౌరవం బెల్లయుం దీఱె, నాయాగ్రహంబునకుం బాత్రంబై యీకనఁబడు నామాధమయెడ నీ కేమేని యిష్ట ముండినచో దీనిం గైకొమ్ము నీ కిచ్చెద

మద్రే— నా కుత్తర మేమియుం దోఁచకున్న యది

మంధ—గీ భువిని దుర్జనపుంజంబు పుట్టినిల్లు
కన్నతండ్రికి నెదలోని కంటకంబు
నయిన దీనికి నాకోపమ యరణంబు
కొనుము వలపున్న, లేకున్న మనువుడుగుము

మద్రే—నృపాలోత్తమా! మన్నింపుము ఇట్లేని నే నీమనవు వదలకొఁ నెద

మంధ—మ శివనాధా! మన పుర్వపరిచయంబుం బాటింపవలయునేని నే రసహ్యపడునెడ నీ వాసఁ జేయవల దని వారింపవలసినవాఁడ కన్నతండ్రనేనియుం గొమారిత యసం దలవంపు వ టిల్లు నిద్దురాత్మం బరిహరింది నీ నెయ్యం జెయ్యెడనేని యర్థ్యం బగుతావునం తగులనిమ్ము

మాళి—ఐ ఇది కఱువింతగాదె నృప! యీక్షణికంబున నిక్కుమారి నీ
మదికి ననర్ఘరత్నముగ మాన్యగుణోత్తరగా ధరిత్రి నీ
మదిమికి నూతగాదగిన పుణ్యచరిత్రగఁ దోఁచి యింత నే
యెదకుళిలీముఖుం బగుట కేమియొనర్చె మహాపర ధమ్మ?

ముకి—సీ అధిపనేఁజేయంగ నాత్మఁగోరెమదానిఁజేకిచెప్పుటెగాని చెప్పిచేయ
మాటలందునఁదే నెమదిలోన విసమును గలిగి యిచ్చకములు వలక నేర
నిదియుకాదె మనల నెడవాపె నింతవు వేరు నాచేసిన నేర మొకటి
హానియొండెలేక యపకీర్తి యొండెనుగలదెయిందఱును దెలియఁబలుకు
మయ్య నిన్ను భక్తిఁ బ్రార్థింతు నీయున్న
నాదు నిశ్చయింమునారు దీనఁ

గూడియుండునట్టి గుణదోషముల నిట్టి
ధర్మనిర్ణయంబుఁ దల ధరింతు

మంద—నన్నింతకంటె నెక్కువ సంతోషపెట్టలేని నీఁబోటి దుస్స్వభావవు పుట్టకుండినను మేలు

మాళ—గీ ఇంతియేకద కొందరు హృదయసీమ
విస్తరిల్లెడు దానిలో వీసమైన
మెవరింపఁగ నేరరు వినయవతులు
దాన దోషంబు వాటింపఁ దగవు తెలుఁగ?

క ఏమయ్య మద్రనాథా
నీమదిఁ గలయట్టి వలపు నిజము దెలుప వీ
భూమిఁ దదితరాపేక్షా
వ్యామిశ్రితమైన వలపు వలపే తలఁపన్?

ఈ నాకీరత్నంబు దఁకుం దాన యరణంబు వేఱ యరణం బేల? శంకింపక పరిగ్రహింపుము

మద్రే—వరపాలాగ్రణీ! మొదల నీవనుగ్రహించిన యామూఁడవపాలాసంగుమ ఇదె నీకుమారిని నా రాణిగఁ బరిగ్రహించెద

మంద——నా శపథం బమోఘంబు నూదిమొన మోపునంతయైన నే నోప

మద్రే—అట్లే, సుశీల! నీతండ్రి యనుగ్రహముతో నాయనురాగముంగొల్పడితివి

సుశీ—మద్రాధిపా! పరమేశ్వరుఁడు నిను నైశ్వర్యయుతుం జేయుత నీవు సంపదల నే వరించువాఁడవె గాన నేను నీపత్నిగ నుండనొల్ల

మాళ—గీ వనిత నీయెడ జఁకుఁ డవజ్ఞ చేయ
నాదు ప్రేమాంకురంబు గ్రొన్ననలు సాగి
విస్తరిల్లెడు, నిదియేమి విస్మయంబొ!
తండ్రి కెడ మైనకొలఁది నం దారసిలెదు!

చ హారణ మొకింత లేమిన యనర్ఘితముం బవుఁ దండ్రిచె నిరా
కరణము నొంది యుండుటనె గైకొనవర్ఘితమంబవు న్వని
ర్భరిపిత్ర కోపవహ్నిని గరంబుఁ దపింపుటఁ జేసి యేమనో
హారత మవు న్సుశీల! యిటు లర్థిలి నీగదె కేలు పట్టెదన్

గీ ఒప్పులకు నెల్లఁ గుప్పవై యొప్పునీవు
ధరణి నాకూర్మిరాణివై బరగు టరయ
నింతి నాపూర్వ పుణ్యసమృద్ధి ఫలము
పండి రాశిగ నాపాలఁ బడుట కాదె?

(మాళవేశుఁడును చండికామదరసుశీలలును దక్క తక్కినవా రందఱు నిష్క్రమించుచున్నారు )

మాళ—గీ అతివ నివారియెదల నెయ్యంబు నంత
యేని నీదెస లేదుసుమ్మైన నిచటు
వాసి మనవీటి కిపుడ పోవలయుఁ గాన
వేగ వారల వీడ్కొని సాగిరమ్ము

సుశీ—చ ఇదె చనుచున్నదాన పతియింటి కనుజ్ఞ యొసంగుఁడమ్మ వే
డెద నయనాంబువుల్దొరుగ డెందము కొంవలమందఁ దండ్రి మి
మ్మైద ననురక్తి జొబ్బిలఁగ నెప్పుడుఁ జూచెడుఁగాదె మీర లా
మదుసలికే కొఱంతయును ముప్పన గల్గక యుండఁ జూచుఁడి
హృదిమను మీదువాక్యముల నంతయుఁ దేలినదయ్యె నిప్డు దా
ల్పెద నెదలోని తాలిమి చలింపఁగ నిల్వఁగలేక వెండియున్

(తనలో) గీ తెలిసియును మీదుమర్మంబు వెలికిఁ జెప్ప
తోడఁబుట్టినకతన మోమోడుదాన
తండ్రియును నేను పల్కుహితంబు వినడు
ఏమి కానయి యున్నదో యెఱుఁగరాదు

మంద—మావిధుల నిరూపింప నీకేమి ప్రసక్తి?

చండి—నిన్నుం డవపాలిటి భాగ్యదేవతగా మఱియు నీమగని ననుకూలవర్తనలం దనియింప యత్నింపుమే కాని నీ కొండువిచారంబు లేల? వినయవిధేయతాశూన్య వగు నీకుం బితృధనభాగంబు గోల్పడుట యర్హఫలంబు కాదె?

సుశీ—మోస మెన్నిమడతలలోఁ బొదివి దాచినను కాలాంతరంబునం బయల్పడి, చేసినవారి లజ్జాతిరస్కృతులపాలు సేయకమానునే? సర్వేశ్వరుఁడు మీ కభ్యుదయం బొసంగుఁగాత

మాళ—రమ్ము పోదము సుశీలా! (మాళవేశుఁడును, సుశీలయు నిష్క్రమించుచున్నారు)

చండి—మనయుభయులకు నత్యావశ్యకము లగునంశములు పెక్కులు నీతో సంప్రతింపవలసి యున్నవి జనకుఁడు నేఁటిరేయి యింటనుండి వెడలువాఁడుఁ గాఁబోలు

మంప—అది నిశ్చయమే ఈ సెల నీయొద్దకును పై సెల నాయొద్దకును

చండి—వార్ధకమున నీయనచిత్తమున కెంతచాంచల్య మొదవినదో కంటివా? మన మీయనచర్యలను జిరకాలమునుండి కాఁచి వడపోసినవారము ఇంతకుముం దెల్ల మనయందఱలో మనతోఁబుట్టువు నెక్కువ ప్రేమించె ననుట నిస్సంశయము అట్లయ్యునేఁ డామె నెట్లు నిరాకరించెనో చూచితివి గదా?

మంప—ఇగి యంతయు జరాచాపల్యమేకాని యాయన మేలుకాలమున నైన నొడ లెఱింగినవాఁడు కాఁడు.

చండి—అట్లగుటంజేసి యిపు డితని చిరనైసర్గికంబు లగుదర్పధార్ష్ట్యంబులకుం దోడు వార్ధకస్వభావధర్మంబు లగుముంగోపచాపల్యంబులుగూడ జతపడినవి

మంప—సుమిత్రుని దేశత్యాజనమువంటి యవివేకకృత్యంబులకుం దలయొగ్గవలసిన వారము

చండి—మాళవరాజు వీడ్కోలుపు లాంఛన మింకను నవశిష్టముగా నున్నయది ముందు మనము సేయు నన్నికార్యముల నేకీభావముతోఁ జేయుచుండవలయును ఇది మఱువవలదు సుమీ మనజనకుఁడు మునుపటి యధికారముఁ జూపం దలంచునేని సనము సైరించుట కడు దుష్కరము.

మంప—ఆలాగే దీనింగూర్చి ముం దాలోచింతము

చండి—అదను దప్పకుండ నీతరుణములోనే యేదో యొకటి సేయవలెను

ద్వితీయరంగము—చంద్రసేనునినగరు

[దోషాకరుఁ డుత్తరము పట్టుకొని ప్రవేశించుచున్నాఁడు]

దోషా—గీ ప్రకృతిధర్మమ నిన్ను నాపాలిదైవ
తంబుగాఁ గొల్తు నెప్డుఁ గరంబు భక్తి
లేనిపోనివిచారము ల్సేసి పుడమి
జనులు న్యాయాతిరిక్తంబుగను విధించు
సాంఘికాచారజాలంబు సమయు గాత
నట్లు కాకున్న భువి ధర్మ మెట్లు నిల్చు?

చ. పదిపదునాల్గువర్షములు ప్రాయమునం గొఱవడ్డయంత నే
వదలగనేల జ్యేష్ఠునకుఁ బైతృకమైన మదీయసర్వసం
పదలదిగాక నన్జనులు బానిసె బిడ్డని రోయ నేల నా
నుదుటను వ్రాసియున్నదొకొ నొచ్చెడు నామది దీని కెంతయున్

గీ. కాన దా నీసుతుం డను కానివాడ
డేల మాతండ్రి యిరువుర కేకరీతిఁ
గూర్చువాఁ డయి యుండ నా నేర్చినంత
పన్ని నీభాగ్య మెల్ల నాపాలఁ బడఁగఁ
జేయ నోపుదునో యన్న స్వేతకీర్తి
అహహా! యీలేఖ చరితార్థ మయ్యెనేని
వసుధ నీశ్లాఘ్యజన్మంబు వసయదేమొ
చూత మిందుకు దైవంబు సూటిపడిన

[చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చంద్ర—సుమిత్రుఁ డీవడువున వెడలనడువంబడియె మాళవేశుఁ డీసునం బాసి చనియె అసంప్రేక్ష్యకారిత్వముచె రాజునుం దనపరివారమును బ్రాస్వపఱచుకొని యీరేయి నగరు దిగనాడి పోయె దోషాకరా! ఏమిసమాచారము?

దోషా—(ఉత్తరము దాఁచుచు) ఏమియును లేదు మహాప్రభూ

చంద్ర—ఆయుత్తరము దాప నంతత్వర యేల వలసె?

దోషా—విశేష మేమియును లేదు తండ్రీ!

చంద్ర—నీ వాజాబులోఁ జూచునదేమి?

దోషా—మఱేమియును లేదు

చంద్ర—లేమా లేనిదాని దాపరమున కేల నంత వేగిరపాటు? తెమ్ము చూతము ఏమియు లేనిచో సుశోచనముల యవసరముగూడ నుండదు

దోషా—అయ్యా క్షమింపుము ఇది నాయగ్రజునియొద్దనుండి వచ్చిన యుత్తరము తుదముట్టం జదువుకొనలేదు చదివినంతవఱకు తాము చూడఁదగియెడునది కాదు

చంద్ర—ఇటు లిమ్ము తడవు సేయకుము

దోషా—ఇచ్చిన నీ కున్న నపరాధి నే యగుదును చదివినంతవఱ కిందలి సంగతుల నొగే కన్నట్టిడిని

చంద్ర—తెమ్మిటు చూతము

దోషా——నాకు మీయెడఁ గలవిశ్వాసమును బరీక్షింపఁ దలఁచి యాతఁ డిట్లు వ్రాసెఁగ వలయు

చంద్ర——(ఉత్తర మందుకొని చదువుచున్నాఁడు) వార్ధకము యొక్క లోభ వైశస్యములకు మన మొదిగియుండవలయునది కారణంబుగా మనకు యౌవనదశయందే ప్రపంచ మన్న వెగటు దోఁచుచున్నయది ఆయుఃకాలమున ననుభవింప నగు సంపత్స్వతంత్ర్యములు వార్ధకముపైఁబడి వాంఛ లుడుగునంతవఱకును మనలం జెందకున్నయవి ఇవంతయుఁ బెద్దవాండ్రు పెద్దతనమువం దీఱిక గల్గియుండ నొల్లక లేనిపోనితాపత్రయముపైఁ బెట్టుకొనుటవలని యనర్థము మనము సాగనిచ్చుటవలన జరుగుచున్నదేకాని, చెల్లియుండి చేయునదికాదు నీ వొకసారి వచ్చెదవేని యన్నిసంగతులును సముఖమున మాటాడుకొందము మనతండ్రి తెలివి దెచ్చుకొనక నేను మేలుకొల్పునందాఁక నిద్దుర పోవువాఁడేని నీ వాయనసర్వస్వములో నర్ధభాగమునకు స్వామివై నాప్రియసోదరుఁడవయి యుండెదవు గాక

స్వేతకీర్తి

ఏమీ! కుట్ర! తాను మేలుకొలుపువఱకును నేను నిద్దుర వోవుట! నీవు నాసర్వస్వములో నర్ధభాగమున కధికారి వగుటయు నా? ఔరా! స్వేతకీర్తి! దీని నాలోచింప నీహృదయ మెట్లొప్పెరా? వ్రాయఁ జే యెటులాడెరా! దోషాకరా! దీని నీకెవ్వ రెప్పు డందఁజేసిరిరా!

దోషా——ఎవరు నందఁజేయుట లేదు తండ్రీ హా! ఆమోస మేమోకాని జాలమార్గమున నాగదిలో పడుచుండ నిది నాకనఁబడినయది

చంద్ర——ఇందలి లిపి మీయన్నదేనా?

దోషా——విషయ మనింద్య మయినచో, లిపి యతనిదని ప్రమాణపూర్వకముగాఁ జెప్పఁజాలుదుఁగాని యిప్పటిస్థితిలో నది యాతనిది గాకుండిన బాగుగ నుండు నని యెంచువాఁడ

చంద్ర——వ్రాఁత వానిదే

దోషా——వ్రాఁత యతనిచేతిదేకాని యిందలియంశ మతని హృదయ మందలిదై యుండదని నాయపేక్ష

చంద్ర——వాఁ డిదివఱలో నెన్నఁడేని యీయంశమువిషయ మయి నీయుద్దేశ్యములఁజాడ కనుఁగొనియెనా?

దోషా—ఎన్నఁడును లేదుకాని, పుత్రులు వయసునకు వచ్చి, తండ్రులు పేరునకుమాత్రము పెత్తనము నెఱపుచుండుటయు, పుత్రులే వ్యవహారములఁ జక్కఁబెట్టుకొనుచుండుటయు, నుచితమని యాతఁడు పల్మాఱు భాషింపఁగా విని యున్నవాఁడ

చంద్ర—ఓరీదురాత్మా! పాతకీ! హా! వానిహృదయములోనియూహలే యీయుత్తరములోనివిని ఓరీకృతఘ్న! క్రూరకర్మ! మనుష్యాపశద! ఎందుండురా వాఁడు? ఎందుఁ జూచ్చినను బట్టి తెమ్ము పొమ్ము

దోషా—ఎందుండువాఁడో యెఱుఁగఁగాని, మీయాగ్రహము డించి, యతని యుద్దేశముల నతనినుండయే గ్రహించుకొనువఱకు నించుక యుపశమించెదరేని స్థిరనిశ్చయముతోఁ గార్యంబు నడుపవచ్చు అట్లుగాక వేగిరించి యాచరించిన మీయశోగౌరవంబులకును రూపం బగుటయేకాక యతనికి మీయెడ్డఁ గలవినయవిధేయతలు మొదలంట నశించుటకుం గారణంబునగు దేవరయెడ నాకుం గల క్షేమానుబంధంబుఁ బరీక్షింప నాతఁడు దీని వ్రాసెఁ గావలెనే కాని వేరొకదుశ్చింతతోఁ గాదు ఇందుకు సందియంబు వలదని నాప్రాణంబు పణంబుగాఁ బల్కెద

చంద్ర—ఇదియా నీయూహ?

దోషా—దేవరయభిమతంబేని యీవిషయమై మే ముభయులము ముచ్చటించుచుండుసెడ నిందలి యథార్థమును మీవీనుల విని మీరు మనస్సమాధానము నొందు నేర్పాటు, నేఁడు ప్రొద్దు గ్రుంకక మునొనర్చువాఁడ

చంద్ర—వాఁ డింత కృతఘ్నుఁడుగ నుండియుండఁడు

దోషా—ఉండఁ డనుటే నిశ్చయము

చంద్ర—అందులోను దన్నంత హృదయపూర్వకముగాఁ బ్రేమించుతండ్రిపట్ల దోషాకరా! నీబుద్ధికుశలత యంతయు వినియోగపఱచి, వానిని వెదకి తెచ్చి వానియూహలు నామనోగోచర మగునుపాయ మాలోచింపుము కార్యనిశ్చయమునకుఁగా నిందలి నిజస్థితి దెలియుటకై నా యైశ్వర్యము సర్వమునైన నీఁగడంగుదు

దోషా—చిత్తము ఇప్పుడే వెడలి నాయోపినకొలఁదిం గార్యానుసంధానమొనర్చెద

చంద్ర—ఈయేటివసుసఁ గన్పట్టిన సూర్యచంద్రగ్రహణములు మొదలగునవెవ్వియు శుభోదర్కములు గావు ప్రకృతిశాస్త్రజ్ఞు లేమేమియుక్తులఁ గల్పించి, వీనిం జులకనగాఁ జూచినను, వీనివలని యనర్థములు ప్రపంచమును బీడించుచునే యున్నవి.

ఎక్కడఁజూచినను గుటుంబములఁ గలతలు, రాజమందిరంబుల ద్రోహంబులు, పట్టణంబులఁ గల్లోలములు పల్లెలఁ గలహంబులు, అన్నదమ్ములకును దండ్రిబిడ్డలకును గలయనుబంధము లొక్కనిముసమునం దుత్తునియలగుటయుచుం గానఁబడుచున్నయవి ఇందుకు నిదర్శనముగా నిద్దురాత్ముఁడు దండ్రినగు నాకెగ్గు దలంచువాఁడు మనరాజునం దన ప్రకృతిం దిగనాడి కన్నబిడ్డను బోనాడె మామేలుకాలము గతించినది అవసాన దశకుఁ గపటము, ద్రోహమును కుట్ర, కృతఘ్నత మొదలగునవి సంప్రాప్తమైనవి దోషాకరా! ఆదుష్కర్ముని వెదకి పట్టి తెమ్ము సుమిత్రుడు నిజమాడిన యపరాధమునకు దేశము విడిచిపోవలెను ఆహా! కాలమహిమ (చంద్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

దోషా—మ. అకటా! లోకము వెఱ్ఱిఁ జూడఁగ మనం బాశ్చర్యమగ్నం బగున్
స్వకృతాకార్యఫలంబు లాపదలుగా సంప్రాప్తమై యొంచఁ ది
గ్మకరేందు గ్రహతారకాళి యొనరింపం బోలనం చెంచి కా
నకశాంతుల్ ఘటియింత్రు పుంగొకయెడ న్నం దొందుచో నన్గతిన్

ఆ. కామమోహలోభకలుషితహృదయుఁడై
బుద్ధిపూర్వకముగఁ బూని చేసి
కొనినదానిఫలము వెనువెంటఁ దగిలిరా
దానికారణంబు దానెకాక
గ్రహము లేమిచెసె కర్మంబు దైవంబు
నేమి చేసె నింత యెఱుఁగవలదె

తే. అవనిపై నిజశక్తి యత్నానురూప
మైనగతిఁ జెందునరుఁ డెందు నరసిచూడ
నాగమశకంబులేక లగ్నంబునందు
జననమొందిన దోమ గజంబు సరియె

ఆదె వెదకఁబోయినతీఁగె బదములఁ దగిలినట్లు స్వేతకీర్తి యరుదెంచుచున్నాఁడు నేనుస్వత్తప్రలాపములతో నాచెయు క్రూరకర్మమున కెత్తుగడ సేయవలయు హా! యీ మధ్యఁ గల్గిన గ్రహణములే యీకలతల కెల్లం గారణములు స- రీ- గ - మా

స్వేత—దోషాకరా! నీ వేమి దీర్ఘాలోచనలో మునిఁగి యుంటివి?

దోషా—ఈగ్రహణములయొక్క భావిఫలములనుగూర్చి వ్రాయఁబడిన కొన్ని యంశములు నిన్నఁ జదివినవి తలఁపునకు వచ్చి యిందువిషయ మయి యోచించు చున్నాఁడ

శ్వేత—అదియా యాలోచింపుచుంటివి ?

దోషా—ఇదేమిపాపమో కాని యా వ్రాయఁబడిన యనర్థము లన్నియు నెఱవేఱుచునే యున్నవి అకాలమరణములు, అనావృష్టి, దుర్భిక్షము, రాజద్రోహము, తండ్రిబిడ్డలకుఁ గలతలు, చిరంతనస్నేహవిచ్ఛేదము, మిత్రులపరిత్యాజనము, దంపతులవైషమ్యములు, లోనుగాఁ గలయవి

శ్వేత—నీ వెంతకాలమునుండి జ్యోతిషమునందుఁ బరిశ్రమ చేయుచుంటివి

దోషా—ఎంతకాల మయిన నేమికాని, నీవు మనతండ్రి నెప్పుడు చూచియుంటివి

శ్వేత—ఏమీ? గడచినరేయియ

దోషా—మీయిరువురకు నేమైన సంభాషణ జరిగినదా?

శ్వేత—ఒకజాము వఱకు మాటలాడుచుంటిమి

దోషా—సంభాషణ యనుకూలముగానే తుదముట్టినదా? నీవు జనకుని వీడునెడ నాయన ముఖవిలాసమునం దేమేనిమార్పు పొడగంటివా?

శ్వేత—అణుమాత్రమును గాన

దోషా—ఆయన కాగ్రహజనక మగుపని యేమేని చేసియుందువేమో స్మరణకుఁ దెచ్చికొనుము ఏది యెట్లున్నను నావిన్నపము మన్నించి యాయనకు నీయెడం గల కోపోద్రేకము కొంత యుపశమించువఱకు నాయనకగపడకుము ఆయన యాగ్రహము ప్రస్తుతస్థితిలో నీరక్తముఁ గనుల జూచినను చల్లారదు

శ్వేత—హా! ఎవరో దుర్మార్గు లాయనమనసు విఱిచిరి కాఁబోలు

దోషా—అదే యనుమానము నాకునుం గల్గుచున్నయది నామనవి విని ధైర్య మవలంబించి యాయనకోప మణఁగువఱకుఁ దాలిమి నిలుపవలయు నీవు నావెంట నాయింటికి వచ్చెదవా, జనకుఁడు నిన్నుగూర్చి భాషించునది నీకు శ్రుతిగోచర మగు తావున నిను నిలిపెద దయచేసి రమ్ము దీనింబట్టి కొదువసంగతు లూహింపుమది మఱియు నొకమాట నీ విలువెడలునపు డెల్ల నాయుధపాణివయి పొమ్ము

శ్వేత—ఏమీ! ఆయుధపాణినై పోవలయునా?

దోషా—ప్రియసోదరా! అదే నాకుముఖ్య మయినహితము మనతండ్రిహృదయమున నీయెడ నణుమాత్రమును సదుద్దేశము లేదని ప్రమాణపూర్వకముగఁ జెప్పఁగలను ఇదంతయు నేఁ బ్రత్యక్షముగఁ గన్నది విన్నదియుంగాని యెంతమాత్రము ననుమానము వలన నూహించినది కాదు నమ్ముము నామాట విని తొలఁగి చనుము

స్వేత—అప్పటప్పటవిశేషములు శ్రుతపరచుచుందువుగా
దోషా—అవశ్యముగా నీచెప్పినచొప్పునఁ జేయువాఁడ
(స్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

గీ. తెల్లనివి యన్ని పాలను నల్లనియవి
జలములుగఁ గొంచు నెవరేమి పలికిన నది
విశ్వసించెడు జనకుఁడు, విమలచిత్త
వృత్త్యుదారత నన్యుల కెగ్గు దలఁప
కున్కిఁ దన కొకకీ డుర్వి నొందలోన వర్త
రి నెడు సందియమును బొంద డ్రెఁ జుండు,
కాన నిఁక మీఁదికార్యంపుగతియుఁ దెలిసె
నాదుమాయలు వీరలమీఁద నడరి
సాగునట్లేని పైఁ బండి యేగునోజ
నుర్వి నెవ్వది యున్నతి నొసఁగు నాకు
నరయనది యెల్లయుక్త మయ్యది యొనర్చి
జన్మవంతను గాకున్న చతురమతి స
హాయమున రాజ్యసంపద లందుకొందు
(నిష్క్రమించుచున్నాఁడు)

తృతీయరంగము—స్వేతధ్వజుని మందిరము
[చండికయు నామె గృహకృత్యనిర్వాహకుఁ డగుకుక్షింభరుఁడను
ప్రవేశించుచున్నారు]

చం—లనపరిహాసకుని మందలించినందుకుఁగాను మాతండ్రి నాయుద్యోగస్థునిఁ గొట్టినాఁడా?

కు—ఔను కొట్టినది నిజమే

చం—క. తానును దనపరివారము
నానాసుఖం బొనర్చి నగరోకకడసుం
దే నిచ్చిన నన్నాఁడు
నో నాసునకారణంబ నోటిమదమునన్

గీ. వేఁటనుండి యతఁడు నేఁటిప్రొద్దింటికి
వచ్చుసమయమునను ద్వారముచెల

సు—అయ్యా! మనుష్యుఁడను

రా—నీవృత్తియేమి?

సు—నావృత్తిని నావేషమే విశదము చెయఁగలదు నమ్మి పని గొనువారిఁ గొలువను, యోగ్యులను ప్రేమింపను, బుద్ధిమంతులు మితభాషులు నగువారలతో సంభాషింపను గుతూహలముగలవాఁడ గత్యంతరము లేనిచోఁ గలహింతు, నేమంబును నొక్కటఁత గలవాఁడ

రా—నీజీవన మెట్టిది?

సు—నాజీవనంబ దీనవృత్తి గడుపుకొనువాఁడ పేదటికమున మారాజుతో సెనయగుదు

రాజు—ప్రభువులలో నతఁ డెట్టిపేదయో ప్రజలలో నీవట్టి పేదవేని నీవంటిపేద పృథ్విపై నుండఁడు ఏమికోరి వచ్చితివి?

సు—కొలువుఁ గోరి

రాజు—ఎవరిని గొల్చెదవు?

సు—నిన్ను

రాజు—నన్నెఱుంగుదువా?

సు—ఎఱుంగనుగాని నీమొగముగన్న నిన్నుంగొలువ బుద్ధి జనించుచున్నది పనిగొనుము

రాజు—ఏమి పనులు నేర్తువు?

సు—మంత్రరహస్యమును రక్షింపను, స్వారిచేయను, దారినడుమను కథలు నుడువను నేర్తును రాయబార మొనర్చునెడ మోమోటమి దక్కి పల్క నేర్తు సామాన్యజనులు చెయఁగల్గినదెల్ల నేఁ జేయఁజాలుదు ఆర్జవము నాసొమ్ము.

రాజు—నీ వయ సేమి?

సు—ఎత్తును దించను రానిప్రాయములో నున్నాఁడను విషయేచ్ఛలుడిగియు నుడుగకున్నయవి నలువదియెనిమిదేండ్లు నెత్తిమీఁదికి వచ్చినవి

రాజు-అయితే లెమ్ము కొలువరమ్ము నాభోజనానంతరముద నుక నీపరిచర్య తుష్టికరముగ నుండునేని నీవు నాయొద్దన నిల్చెదవుగాక [illegible]రచటు? భోజనము సిద్ధమయినదా? విదూషకుఁ డేడ?

(భటుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రా—'అంబికాఁగా' నాకొమార్తె ఎచట నున్నదిరా?

కు—చిత్తము (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—ఆయవాత్రుఁ డేమి గొణుగుచు పోవుచున్నాఁడు వానిం బట్టి తెండు (భటుఁడు నిష్క్రమించుచున్నాఁడు) విదూషకుఁ డేడ? నిద్రపోవుచున్నారా! ఏమి పలుకఁ?

[భటుఁడు తిరిగి ప్రవేశించుచున్నాఁడు]

ఏదీ యాతఁడు?

భటు—స్వామీ! మీకొమార్త శరీరస్వాస్థ్యము దక్కియున్న దని చెప్పిపోయి నాఁడు

రాజు—నేఁ బిలిచినపు డేల రాఁడాయె నాతఁడు?

భ—రా నని స్పష్టముగాఁ జెప్పిపోయినాఁడు మహాప్రభూ!

స—స్వామీ! నాకుం గారణ మేమో తెలియదుగాని యిటీవల మీదుహితృజామాతలందును వారిపరిజనులందునుగూడ మీవిషయమయిన పూర్వప్రపత్తివిశేషము సన్నగిల్లుచున్నట్లు నాకు స్ఫురించుచున్నది

రాజు—అట్లుంటి వేమి?

సు—మీయెడ ననాదరణ పొడగాంచినపుడు తెలియఁబలకట నాధర్మ మని తెలిపితిని తప్పేని క్షమింప వేఁడెద

రాజు—నాయనుమానమునే నీవును స్థిరపఱచుచున్నావు ఈమధ్య వారిప్రవర్తనయందుఁ గొండొక యవజ్ఞాభావము నాకుసుం దోఁచినది కాని దానికి నాయనుమానప్రకృతి కారణ మనకొంటినిగాని వారియనాదరణ కారణ మని తెలియనేరకుంటిని ఎట్లయినను బాగుగ నరసి చూచెద విదూషకుఁ డేడ? రెండుదినములనుండియు నాకన్నులఁ బడకున్నాడు

సు—స్వామీ—మీచిన్నకొమార్త వెడలిపోయినప్పటి నుండియు నాతఁడు కృశించుచున్నాఁడు.

రాజు—ఆమాటె త్తకుము నేనుం గనిపెట్టితిని ఒకరు నాకూఁతునొద్దకుఁబోయి నేనామెం జూడవత్తునని చెప్పవలయును మఱియొకఁడు నా విదూషకుని వెదకితోడ్కొని రావలయును

(ఇద్దఱుభటులు నిష్క్రమించుచున్నారు)

[కుక్షింభరుఁడు తిరిగి ప్రవేశించుచున్నాఁడు]

రాజు—అయ్యో! ఇటు దయసేయుము దేవరవారు నన్ను గుర్తెఱుఁగుదురా?

కు—నీవు నాయజమానురాలి తండ్రివి

రాజు—ఛీ! నీయజమానురాలితండ్రినటరా జానిసకొడుకా! తులవా! పశువా!

కు—ఇం వొకఁడును నేగాను క్షమింపుఁడు

రాజు—ఛీ! నావైపు కోరచూపు చూడసాగితివా? (కొట్టుచున్నాఁడు)

కు—నే దెబ్బలు తినను

సు—తన్నులు తినుదువుగాఁబోలు (పడఁదన్నుచున్నాఁడు.)

రాజు—భళీ! తగినప్రాయశ్చిత్త మొనర్చితివి మెచ్చితి నీపారితోషిక మందికొనుము

సు—ఓరీ! లేలెమ్ము నీకు వారపారలు నేర్పెదను ఓరిదుర్వినీత! లెమ్ము దులుపుకొని పొమ్ము ఇఁకమీఁదట వారపార లెఱింగి నడుచుకొమ్ము, మరియొకసారి ప్రాణాచారము పడఁదలఁతువేని నిలువుము మంచిది బుద్ధిగల్గి పోవ సాగితివా? పో పొమ్ము (అని గెంటుచున్నాఁడు)

రాజు—న కుం ప్రియం బొనర్చితివి దీనిం గైకొమ్ము (ధనకోశ మిచ్చుచున్నాఁడు)

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విదూ—వీనికి నేఁగూడఁ బారితోషిక మిచ్చెదను ఇదిగో యీకుళాయి గైకొమ్ము (కుళాయి నిచ్చుచున్నాఁడు)

రాజు—ఓరి వెంబరివిత్తా! క్షేమమా నీకు?

విదూ—(సుమిత్రునితో) ఓరీ యీకుళాయిం బుచ్చుకొమ్ము.

సు—ఏలరా వెంగళీ!

విదూ—కలిమివానినవాని దెలిమిఁ గోరినఁదున కయి గాలివాటు మెఱిఁగి మొగము ద్రిప్పకొననివాఁ డవశ్యము ఎరో భారముపాలు గాకపోఁడు ఇదిగో కుళాయి తడవుసేయక గైకొమ్ము ఈమహానుభావుఁడు ఇద్దఱుకొమార్తెలను వెత్తి ప్రేమచేకడకొత్తి మూడవదానిం దనయాగ్రహముచే నదృష్టముపా లొనర్చెను ఇట్టివాని ననుసరించితేని, నీ పీసుళాయి కర్తుండవే? (రాజుం జూచి) ఓయి వెఱ్ఱిరాజా! నాకుంగూడ నిద్దఱు కొమార్తె లుండినచో జోడుకుళాయిలు గావలయుఁజుమీ!

రాజు—ఎందుకురా పోమరీ?

విదూ—నాసర్వస్వమును వారిద్దఱకుం బంచియిచ్చినమీఁదట నెత్తికి జోడు టోపీ లయినా నిలుచునుగదా!

రాజు—ఓరీ! జాగ్రత, కాయశుద్ధి కాఁగలదు

విదూ—ఔనౌను నిజమాడిన నేఁటికి నిష్ఠురమే? ప్రియమాడినవానికిఁ బెద్దపీటయు, నిజమాడినవానికి నేలమన్నును

రాజు—ఇది ములికివలె నాయెడ నాటుచున్నదా?

విదూ—రాజా! నీ కొకహితము చెప్పెద వినుము

రాజు—అట్లే కానిమ్ము

విదూ—చెప్పెద సావధానుండవై వినుము

గీ. ప్రజలకనులఁ బడెడు భాగ్యంబు గాకుండ
మూలధనము కొంత మడఁచవలయు
వ్యాదయమునను మెలఁగు నెఱుకలో నొకకొంత
నిలిపి మాటలాడ నేరవలయు
నుండుదాని మించకుండ నీయఁగవలె
నాయ మెఱిఁగి వ్యయము సేయవలయు

ఇట్టు లాచరించుచుండునట్టివానికి భువి బేడ వచ్చునేని మాడ నిల్చు

సు—ఇం దేమి విశేష మున్నదిరా యవివేకి?

విదూ—ఏమియు లేదా? మనప్రభువువారికి సొత్తు ఏమియు లేదని నీ వాయనకుఁ దెలియఁజెప్పు నామాట యన నాయన కెన్నఁడును దల కెక్కదు

రాజు—హా! నీప్రలాపము లెంత కటువుగాఁ దోఁచుచున్నవిరా!

విదూ—ఓయిరాజా! అప్రియం బగుపథ్యమునకును, అపథ్య మగుప్రియంబునకును భేదము లెఱుంగుదువా?

రాజు—తెలియదు విశదపరుపుము

విదూ—లేశమేనియు దాఁచికొనక సర్వమును నిచ్చివేయుమని, రుచించునట్లుగా నీకుం దోపచెసిన నీబుద్ధి రెండవది లేశమేనియు దాపక యున్నది యున్నట్టుగానే చెప్పునది మొదటిది

రాజు—ఓరిపశువా! నన్ను అవివేకిగాఁ గట్టితివిరా?

విదూ—అవివేకమే నీకు నలిచినసర్వస్వమును తక్కిన దెల్ల నన్యులపాలే చేసితివి ఇదిమాత్రము నీకు సహజసిద్ధము కావున నిన్ను పశువనయ్యె

రాజు—ఓసీ పొగరుబోతా! జాగ్రత నోటికి బుద్ధి చెప్పుకొనుము

విదూ—నీయొక్కయు నీకొమార్తలయొక్కయు చర్యలత్యాశ్చర్యావహములు నారాయణ యన్న బూతుమాటగ నున్నది నిజమాడిన నీకు నిష్ఠురము, అబద్ధమాడిన వారికి నిష్ఠురము ఊరకుండిన యంతఅకును నిష్ఠురమే నే నీపరిహాసకుఁడగుటకంటె మఱి యెవరయినను బాగుగనుండును గాని నీవుగా నుండనొల్లను సుమీ నీవు నీయైశ్వర్యముతో నీవివేకమునుగూడ రెండుచెక్కలు చేసి యిర్వురకు నిచ్చివైచి మధ్య శూన్యతనుమాత్రము మిగిల్చికొంటివి ఇదిగో ఒకచెక్క విచ్చేయుచున్నది

[చండిక ప్రవేశించుచున్నది]

రాజు—ఏమమ్మా నీముఖవికాసము దప్పుటకుఁ గారణ మేమి? ఏమోకాని యీమధ్య నీమొగము కాలుగ్రమ్మియే కనుపట్టెడిని

విదూ—ఆమెయొక్క యాగ్రహానుగ్రహములతో నిమిత్తము లేకుండినంతవఱకు నీవు ధన్యుఁడవుగా నుంటివి ఇప్పుడు నీస్థితి దాపలయంకెలేని శూన్యాంకముమహిమం బరఁగుచున్నది (చండికతో) నన్ను నోరు మూయుమని నీమొగము చెప్పకయే చెప్పుచున్నయది ఇఁక మాటాడనులే నోటిముంగలిది బోర్లతోసికొనినవానికి జోలిపట్టి తిరిపమెత్తక తప్పునా? (రాజును జూచి) రాజా! అదిగో యేనుఁగు మ్రింగినవెలగపండు కనఁగొంటివా?

గీ తనకు మాలినధర్మంబు ధాత్రిలోన
విత్తనంబుల మరలని రిత్తకృషియు
మొదలు చెడుబేరమును నివి మూఁడు నరయ
జనని చెటునకగుటకు సందియంబె

చం—సీ నోటి కడ్డములేక మాటికిఁ బ్రేలు నీపరిహాసకుఁడెకాక పరిజనంబు
లేయుంబవ ల్లొక్కరీతి కల్లరి చెసి యిల్లొక్కడకుఁ దెత్తు రేమి చెప్ప
నీకు విన్నవింప నెమ్మి నియ్యది నాయము ననెదు నాసయుఁ దీరె నయ్య నేఁడు
నీదుపల్కులు విన్న నీదుచెయ్వులు గన్న నీవ పీరల కెల్లఁ ద్రోవఁ జూపు
పగిది తోఁచెడు నింక నిబ్బంగి యైన
నింటిలోపలిపోరితం బీఁగ నోపు
పని యొనర్చెద మది కది భార మైన
నలుక మై యొంకు నీవు నన్ననఁగవలదు

వి—రాజా! ఒకకథ చెప్పెద వినుము

ఆ కూటనుండి పొడిగి గ్రుడ్డు కూనఁగఁ జేసి
ప్రేమతోడఁ బెంపఁ బెఱిఁగి వడియుఁ
గోయిల యల కాకిగొంతుకుఁ గొఱికెగాఁ
గాకి వెఱ్ఱి చేసి గంతు మిగిలి

కథ కంచెకుఁ బోయినది మన మింటికి వచ్చితిమి

రా—ఏమీ! నీవు నాకూఁతుర వేనా !

చం—నీమనస్సు కలకఁ దీర్చికొని నీస్వభావసిద్ధ మగు సద్బుద్ధి నూహింపుము

వి—బండికట్టును లాగుచున్న వైఖరి దెలియుటకు బుద్ధి కావలయునా ? గాడిదైకైనం దేటపడకున్నే?

రాజు—హా! నే నెవరినో యెఱుంగువా రిచట నెవరేని యుందురా ? ఈనేనా యామందపాలచక్రవర్తిని? ఇటులేనా చక్రవర్తి మాటాడునదియు వర్తించునదియు ? ఏమి ఇదికలయా? నిక్కువమా ఇచట నెవరైనా నే నెవ్వరినో చెప్పఁగలరా ?

వి -నీవా చక్రవర్తిఛాయాప్రాయుఁడవు?

రాజు—బాగుగఁ దెలివికిం దెచ్చితివి తెలివిఁగలిగి విచారింపఁగా నే నెక్కడి చక్రవర్తిని? ఇది యెక్కడిపత్రిక ఇదియెల్ల కల్లఁగాఁ దోఁచెడిని (చండికను) ఏమమ్మా మానినీమణి నీనామ మేమి?

చం—అయ్యా! ఈయతివినయము నీయితరమతివిభ్రమములకుఁ జతగా నున్నది నీవు నాయుద్యమముల యదార్థములు గాఁగుర్తెఱుంగవలయునదిగా నాప్రార్థన నీవు పెద్దవాఁడవు, యుక్తాయుక్తములవివేచన సేయుము నీవు నాయింట ధూర్తులును దుర్వ్యసనాసక్తులును నగుకూర్పురు పరిజనుల నిల్పితిని వీరిమూలమున నారమ్యహర్మ్యంబు రథ్యావధ్యగతమద్యశాలాలీలం గన్పట్టుచుంజాలలజ్జావహముగనున్నయది కావున మదీయప్రార్థనం బంగీకరించి నీవయ పరిణామంబున కనురూపులయివారి పారలెఱుంగఁజాఁ వారిం గొండఱి నేరుపఱచికొని నీపరివారంబుం బరిమితమాత్రంబు సేయంజాలవేని స్వయంబగా నే నా పనికిఁ బూనుకొనవలసి యున్నది

రాజు—ఛీ! పిశాచమ! ఎవఁడురా! గట్టిగులను సిద్ధపరుపు మని చెప్పుము ఓదుర్జాతీ! నీ కింక శ్రమ యియ్యరు ఇంకను నొకకొమార్తె గద్దుగదా

చం—నీవు నాసేవకులఁ గొట్టసాగితివి, నీపరిజనులు మమ్మందఱిని సేవకులకంటె హీనముగాఁ జూడసాగినారు

[శ్వేతధ్వజుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రా—(తనలో) హా! మించినవెనక పశ్చాత్తాపము పడుట యెంత వివేకహీనత (శ్వేతధ్వజునకు) ఓహో! వచ్చేసితివా ఇదియెల్ల నీకు సమ్మతమే గదా! ఏమి మీరు పలుకరు.

గీ హా! కృతఘ్నతామహాపిశాచము యశ్శ
హృదయ! నీవు బిడ్డయెడదఁ బొడమ
అకట! మిత్తికంటె నాఖిల రౌరవ
నారకాగ్నికంటె ఘోర మగుదు

శ్వేత—అయ్యా సైరింపుము

రాజు—(చండికతో)

శా ఛీ! నీనాలుక ఛిన్నభిన్నము లుఁ జీలంగరాదే ధరి
త్రీనాథోత్తమవంశజాతులయశశ్రీవైభవోపేతులన్
మానశ్లాఘ్యుల నింగితజ్ఞులను సన్మానస్థుల స్వైరి నీ
వీనిం దల్ప చరించినందునకునై యిబ్బంగివా మాధవా?

గీ అకట! యెంత పేలనై సుశీలయెడల
గొంచె మంచుదాని గొప్ప చెసి
ప్రేమ విడ మొనర్చి బిడ్డను దయమాలి
ద్రోచిపుచ్చినాఁడ దూర మనక

శ్వేత—స్వామీ! నే నిరపరాధిని, నీయాగ్రహకారణ మేమియు నెఱుఁగను

రాజు—అట్లయియే యుండవచ్చు (చండికి దెస)

సీ హా విధీ యీపాపి ననపత్య చెయుమీ సంతానయోగం బొకింత యున్న
ప్రాలు పోఁ దుడిచి యీరాకాశిగర్భాన వంధ్యత్వ మొకట్టట బాదుకొలుపు
మిది మఱచెదవేని యీకూళకడుపున జనియించుబిడ్డల ననవరతము
రోగపీడితులను ద్రోహచిత్తులఁ గడు సులభకోపులఁ గృతఘ్నులుగఁ జేయు
మవని విశ్వాసహీనులు నవినయపరు
లైనవారలఁ గనువారి యార్తి నిదియు
ననుభవంబున నఖిలంబు నపుడు దెలియు
మఱువకుము విధి నా దగుమనవి దీని

(నిష్క్రమించుచున్నాఁడు)

స్వేత—హా దైవమా! యాగ్రహంబునకుం గతం బేమి?

చం—నీ కేల యాచింత? ఆయన వార్ధకచాపల్యమును సాగినంతవఱకు సాగనిమ్ము

[రాజు తిరిగి ప్రవేశించుచున్నాఁడు]

రాజు—ఏమీ! క్షణములోనే యేఁబదుగురుపరిజనము నను వీడుకోలా? ఒక పక్షమయినను సాఁగలేదే?

స్వేత—అయ్యా! ఏమిసమాచారము

రాజు—చెప్పెదనులే (చండికతో)

శా. గుర్తెల్లం జెడి గ్రుడ్ల నీరిడి మనఃక్షోభంబునన్ ధైర్యము
న్బట్టై దూలఁగఁ జిక్కుఁబట్టి వెర వెంతేఁ దక్కి యుండంగ నన్
జెట్టా చేయఁగఁజాలి తీవని మదిం జింతింప సిగ్గయ్యెడున్
గట్టా! దాయలకైన యిట్టితులువల్ గల్గంగరా దెన్నఁడున్

ఛీ! పాపి నరకాగ్నిం ద్రెళ్లెదవు గాత! పితృశోకాగ్నిం బొడమెడు శాపానలజ్వాలల నీయింద్రియపాపం బొనర్చుగాత! ఏమి కన్నులారా! వేలపడి జాలుకొనియెదరు ఇంక నట్లు కావింతురేని యశ్రుజలంబుతోఁ బెరికి మంటిం బదును సేయ మిమ్ము విసర్జించెద కటకటా! ఎట్టిగతి వచ్చినది? అయిననేమి నా కింకొకతనయ గలదుగదా! ఆమె సదయాంతఃకరణ యగుటను సందియం బుండదు నీదుశ్చరితము విన్నంతనే తనఖరనఖ శిఖరంబుల నీముఖచర్మం బొలువకున్నె? ఆమె ప్రాపున నే నింకను పదభ్రంశంబు నొందక కాలంబు పుచ్చవచ్చు

(రాజు, సుమిత్ర, పరివారకుఁడు నిష్క్రమించుచున్నారు)

చం—ప్రాణేశ్వరా! అంతయుఁ గనిపెట్టితివిగదా!

స్వేత—హృదయేశ్వరీ! నీదెస నా కెంతకూరిమి గల్గినను పక్షపాతబుద్ధి నా చిత్తంబున కెక్కదు

చం—అయితే కానిమ్ము కుక్షింభరా! (విదూషకునితో) నీవు పరమశుంఠఁడవు గాని పరిహాసకుఁడవు గావు నీయజమానిని త్రోవఁబట్టుము

విదూ—రాజా! విదూషకుని వెంటఁ గొనిపొమ్ము

గీ. నెత్తిటోపి నిత్తుఁ గ్రొత్తత్రాడిచ్చిన
టోపి పోయెనేని లోప మేమి

కోర్కె దీర నాపె కుత్తుక కురివోసి
మూలమునకుఁ గట్టి వ్రేలఁగందు

చం——ఏల నతనికి నూర్వురు పరివారము చీటికిమాటికిని రేఁగి మనలకుం బ్రాణ సంశయంబు గల్గింపనా?

స్వేత——నీ పతినంశయమునకుఁ జోటిచ్చుచున్నావు

చం——అది యతిశ్వానమునకంటె మేలుగదా? యద్భవిష్యత్కంటె నన్నాగ విదాత్మత్వము శ్రేయము జరిగినచర్య సర్వమును నాతోఁబుట్టువునకు వ్రాసితిని అటు పైనగూడ నాపె నూర్వరపరిజనుల నంగీకరించునేని

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చం——ఏమీ కుక్షింభరా! నాపోదరికి జాబు వ్రాసితివా?

కు——వ్రాసితిని

చం——తగినజాసటఁగొని వేగమపోయి నీవ పెకు నాయుల్లంబు దెల్లంబు చేయు నెడ నీవుం దోఁచినభంగి రసపోషణచెసె భాషింపుము త్వరలో మరలిరమ్ము

(కుక్షింభరుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

ప్రాణేశ్వరా! నీశుద్ధసాత్వికమునకు నేలోప మెంచఁబోనుగాని యది ప్రపంచమున కించుకేనియుం బనికిరాదు

స్వేత——గీ నాకుఁ దెలియదేమొ నీకుఁ దోఁచినభంగి
యేమి మది దలంచి యేమొనర్తు
బాగుసేయుఁ బూని బాగైనదానినిఁ
బాడు సేయునరుఁడు ప్రాయికముగ

చం—అలాగా?



పంచమరంగము

స్వేతధ్వజుని మందిరమునుంగల సభామంటపము

[మందపాలుఁడు, సుమిత్రుఁడు, విమావకుఁడు ప్రవేశించుచున్నారు]

మంద——ఓ యిసుమిత్రా! ఈజాబు నందికొమ్మని నాకొమార్తయింటికి ముంగల నిలుగుము ఈలేఖయందలివిషయములగూర్చి నిన్నడిగెడు ప్రశ్నంబులకు సదుత్తరంబు లిచ్చుటకంతైటు నధికము నీవిచ్చటివృత్తాంతంబు నాకుతో ముచ్చటింపకుము తడవు సేసెద వేని మేమే ముందగుదుము

సుమి—నీలేఖ నందఁజేయువఱకును నే నిదురింపను

(నిష్క్రమించుచున్నాఁడు)

విదూ—రాజా! ముక్కునకు రెండుప్రక్కలఁ గన్నులుండుటకు గతం బేమో నీకుఁ దెలియునా?

రాజు—తెలియదురా!

విదూ—పసిపట్టి నలవికానిదానిం గనియుమిన గ్రహించుకొనుటకు

రాజు—అకటా! ఆపె కెంత యన్యాయ మొనరించితిని

విదూ—వర్త్త, గుల్ల నేల నిర్మించుకొననో తెలియునా?

రాజు—తెలియదు

విదూ—కొమార్తల కిచ్చివేయుటకుఁ గాదు, తనతల దాఁచుకొనుటకు

రాజు—ఇచ్చినదానిం దిరిగి బలవంతముగాఁ దీసికొందునా? హా! కృతఘ్నుఁ డాలా!

విదూ—వేగిరించి చెసి విషమించినవెనుక పశ్చాత్తాపము పడు బుద్ధిమంతుఁడవు నీ వేల వివేకము గుదురక వార్ధకమునకు వచ్చితివా?

రాజు—హా! మతి పోవుచున్నదా? ఏమి దైవమా తోఁడ్పడుము చిత్తము చిక్కఁబట్టెదను

[రాజభటుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రాజు—ఏమి గుఱ్ఱములు సిద్ధమైనవా?

భటు—అయినవి మహాప్రభూ!

రాజు—అయితే ప్రయాణసన్నాహము చేయుఁడు

(అందఱు నిష్క్రమించుచున్నారు)



శ్రీ

# మందపాల చరిత్రము.

## ద్వితీయాంకము

రంగము—చంద్రసేనునినగరు

[దోషాకరుఁడు ప్రవేశించియుండఁగా దుర్ముఖుఁడు చేరుచున్నాఁడు]

దుర్ము—వందనమయ్యా

దోషా—ఈశ్వరప్రసాదంబు నీకగు

దు—నేను మీతండ్రిని 'జూచి మందరయు వర్ధమానుఁడును నేఁటిరాత్రికి వచ్చెద' రని విన్నవించితి

దో—అదేల ?

దు—అదేమో నాకేమియుం దెలియదుగాని యీమధ్య సమాచారములు దెలియుచున్నవా ? ఇంకను చెవుల గొట్టుకొనుటలోనే యున్నవిగాని వెల్లడియగుట లేదు

దోషా—తెలియుటలేదు తెలియఁబలుకుము

దు—వర్ధమానసితధ్వజులకుఁ గలతలు పొసఁగినసంగతి తెలియనే లేదా ?

దో—సుంతయుం దెలియదు

దు—విదియనాఁడు పొడసూపనిచంద్రుఁడు తదియనాఁడు తానే గన్పట్టెడు కాలక్రమమున నంతయు విశదము కాఁగలదు (నిష్క్రమించుచున్నాఁడు)

దో—ఏమి నాయదృష్టము ! తీరేయి వర్ధమానుఁ డిక్కడకు వచ్చునఁట మత్సమీహితకార్యంబున కన్నియు ననుకూలించుచున్నవి నాసహజన్మురి బట్టుటకయి తండ్రి చారుల నియోగించినాఁడు నే నొకసంకటకృత్య మొనర్పవలసి యున్నది అవిలంబితముగను నిశ్శంకముగను ఘటించి సాహసమున లక్ష్మిఁ బడసెదను అన్నా ! దిగి రమ్ము '

[శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

...కారి నివేశమువలన నినుం గైకొన చారులు దిరుగుచున్నారు నీవు సొచ్చినమరుఁగు వెల్లడి యయినదిగాని చీఁకటి నీకు సహకారిగ నున్నది వర్ధమానునికిం బ్రతికూలముగ నీ వేమి యాడియుంటివా? ఆతనయు భార్యయు నీనడుమేయి నిట కరుదెంచు చున్నారు ఒకవేళ నీతనిపక్షము వహించి సితధ్వజునకు విరుద్ధముగా నేమయిన నుడివితివేని స్మరణకుఁ దెచ్చికొనుము

శ్వేత—నే నాజోలియే యెఱుఁగను

దో—జనకునిరాక చెవులఁ బడుచున్నది క్షమింపుము కృపాణపాణియయి కొంత నాటక మాడవలసి యున్నది నీవునం గత్తిఁగూసి హాహాకారం బొరయుచున్నట్లు నటింపుము నిలనిలు మోరి ద్రోహీ! జనకునియెదుటకు రమ్ము కరదీపము లిటు దెండు అన్నా తొలఁగిపొమ్ము నీకు శుభం బగుగాత! (శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు) నాయొడలిపై కొంచెము రక్తము చెమర్చిన నాపు నిక్క ప్రకాశ మగును (గాయము నాచకొనుచు, త్రొంగుఁబోతు తగవులాటలో నింతకంటె నధిక మొనర్చికొనఁగాఁ జూచియుంటిని

[చంద్రసేనుఁడు కరదీపహస్తులగు నన చరులతోఁ బ్రవేశించుచున్నాఁడు]

చంద్ర—దోషాకరా! ఏడిరా యాదుర్మార్గుఁడు?

దోషా—తనక రవాలము ఝళిపించి కొన్ని మారణమంత్రము లుచ్చరించుచు శక్తి నావాహనము చేయుచు నిప్పు డిచ్చటనే నిలిచినాఁడు

చంద్ర—ఎక్కడ?

దోషా—అయ్యో! రక్తము వచ్చుచున్న దిదిగో చూడుఁడు

చంద్ర—ఏడీ యాదుష్టుఁడు?

దోషా—ఇదె ఈమార్గమున దాటిపోయినాఁడు తనయావచ్చు శక్తియుక్తులను వినియోగించి—

చంద్ర—పాఱుఁడు పట్టుఁడు శక్తియుక్తుల వినియోగించి యేమిచేసె నా ద్రోహి?

దోషా—నన్ను మీకథకం బురికొల్ప జూచ్చెను గాని—

చంద్ర—ఔరా పాతకీ!

దోషా—నే నందు కియ్యకొనక

మ. కనియుం బెంచియు విద్యబుద్ధియొసగంగా నష్టకష్టంబులో
ర్చినమాతాపితలం గృతఘ్నుఁడయి వంచింపం బ్రయత్నించు నా
జనకద్రోహి శిరంబు వ్రయ్యలుగఁ బగ్గన్వ్యాండ వంపు న్సహా
శనికోటుల్ మనునంతు రౌరవమున న్వాసించు నప్పాతకిన్

అని నిష్ఠురంబుగాఁ బల్కుటయు నాకుత్సితుండు పెచ్చుపెరిగిన మత్సరంబునం దనచేతి నిశితాసిధారవాయరక్షితగాత్రంబు గాఁడవేసిన నేను మూర్ఛాక్రాంతిని నాపరవసంబున కొండె మీకోలాహలంబున కొండె వెఱచి యాపిఱికిపంద తత్క్షణంబ పలాయితుండయ్యె.

చంద్ర—శా. పోనిమ్మూఖులఁ డెంతద వ్వరిగిన న్భూగర్భముం జొచ్చినం
గాన ల్పట్టిన నీట డాఁగిన నగాగ్రంబు ల్వెసం బ్రాకినన్
వానింబట్టి వధింతు నానృపశు నెవ్వండేనియుం డాఁచినన్
వానిం దోడనె రూపుమాపఁగఁ బ్రతిజ్ఞం బూనితి న్దీక్షమై.

చామలారా! నాప్రతిజ్ఞఁ బ్రకటించి, వానింబట్టి తెచ్చువాని కమూల్యం బగుపారితోషికం బొసంగంబడునని యెల్లచోఁ జాటఁబంపుఁడు

దోషా—నేనెంత చెప్పినను దనదుశ్చింత విషవక కృతనిశ్చయుండయియున్న యాతని యునికిం జూచి నేనంతయు బయలుపుచ్చెద నని భయపెట్టిన నాతఁ డిట్లనియె. 'ఛీ దాసీపుత్ర! నేఁ గదనచుండ నీవాడుమాట లెవరు విశ్వసింతురు? నీ వెంత రచనపోషణ సేసె చెప్పినను నాచేవ్రాలుతోడి యుత్తరము సాక్ష్యముగాఁ గొని పలికినను, అదియెల్ల నీకృత్రిమమనుకొందఱు విశ్వసించునట్లు చేయుట నాకెంతయు సులభసాధ్యము ఎట్లంటివేని ప్రపంచము నెట్టిమందుఁడయినను నానాశమువలన నీకుం జేకూరులాభమును గ్రహింపలేకుండునా? అట్లుగావున నాప్రాణాపాయమున కయిన నీ వెట్టియుపాయములు పన్నుచుంటివని నేఁ జెప్పినను గట్టిగ నచ్చునివా రందురు

చంద్ర—ఔరా క్రూరకర్మా! ఎంతసాహసమునకయినం జాలుదువురా! ఏమీ వానివ్రాలే తనది కాదనఁ బూనెనా యాద్రోహి? ఆకులపాంసనుఁడు నావంశము చెడఁబుట్టినాఁడు అల్లదె వర్ధమానుని ప్రవేశతూర్యంబులు కర్ణగోచరము లగుచున్నవి కాని యానాయకునకుఁ గతం బేమియో గోచరింపకున్నది ఆదుర్మార్గుఁడు వెలువడకుండ నిర్గమద్వారంబులకడం గావలివారి నిల్పవ సార్వభౌముఁడు నిందుల కవశ్యము ననుమతించువాఁడు ఇంతియేకాక వానిరూపురేఖ లెల్లరును గుర్తెఱుంగఁజాలునట్లు పటంబున లిఖించి రాష్ట్రంబున నల్లడలఁ బ్రకటింపఁబడునట్లుగా నుత్తరవు సేసెద పితృభక్తిసంపన్నుండ వగు నీవ నాసర్వస్వంబునకు స్వామి వయ్యెదవు గాక.

[మందరావర్ధమానులు సపరివారముగాఁ బ్రవేశించుచున్నారు]

వర్ధ—ప్రియమిత్రమా! నే నిక్కడఁ జేరియున్న యీస్వల్పకాలములో నే వింతలు వింటిని

మంద—అవి తథ్యం బగునేని యాదుర్మార్గున కేమి దండన విధించినను దగిన నిష్కృతి గానేరదు నేస్తమా భద్రమా నీకు?

చంద్ర—తల్లీ! నాహృదయ మవియుచున్నది

మంద—ఏమీ నాతండ్రి శిక్షను జెరిగిన స్వేతక్కీర్తియే జనకద్రోహము దలంచెనా?

చంద్ర—ఏమి చెప్పుదు తల్లీ! తలంపునకు వచ్చినఁ దలఁపు వట్టిల్లుచున్నది

మంద—కాకేమి? దురర్థులగు నాతండ్రి పరిజనులసహవాసమునం బెరుఁగుచు వాఁడు దేనికి సాహసింపఁడు

చంద్ర—నా కావిషయ మంతగాఁ దెలియదుగాని తెలిసినది వాకొన వాయి రాకున్నయది

దోషా—తల్లీ! అతఁ డాసమాజకములోనివాఁడే

మంద—సహవాసమున దోషము లబ్బు టొకయబ్బురమా? ఆయుక్కివులు వానిం దమవానిం జేసికొని వానితండ్రిసొత్తు విచ్చలవిడిగా వెచ్చపెట్టిన ద్వేషముతోఁ దండ్రి వధకు వానిం బ్రేరేపించియుండెడుఁబోలు వానిచర్యలనుగూర్చి యీప్రొద్దు నాతోఁబుట్టువు నాకు జాబు వ్రాసినది వారు నాయొద్దకు వత్తురేని నేను మొగము దుప్పంప నిశ్చయించుకొంటిని

వర్ధ—నానిశ్చయము నంతియ దోషాకరా! నీవు నీతండ్రియెడలఁ బరమభక్తి యుక్తుఁడవయి ప్రవర్తించినట్లు విని సంతసించితిని

దోషా—అయ్యా! అయ్యది నావిధియే కద

చంద్ర—ఖడ్గనైపుణ్యము మెఱయించి వానిం బట్ట గమగించి ప్రేటుపడియె కంటివా యీగంటు

వర్ధ—వానివెనుకొన భటులం బుత్తెంచితివా?

చంద్ర—అటు లొనర్చితిని

వర్ధ—వాఁడు చేఁ జిక్కినా వానివలనిభయము మిఁక లేకుండు నపాయము వీసం దోఁచినభంగి నొనర్పుము దానికెల్ల నేఁ బ్రాపయ్యెద

ద—దోషాకరా! నీవు ధర్మవర్తనంబు మెఱయం బితృభక్తి గెలిపి మాయనున

గ్రహంబు వడసితివి మాకీ యదనున విశ్వాసపాత్రం బగుత్వాదృశభృత్యవర్గంబ వశ్య సంపాదనీయంబు నిక్కంబు దొలత స్వీకరించెదన

దోషా—తక్కుంగలసామర్థ్యంబు లెట్లున్నన, మదాయత్తంబు లగుభక్తివిశ్వాసంబులం గొఱంత లేకుండ సేవాధర్మము నిర్వహించెద

చంద్ర—వానిని దయంజూడుఁడు.

వర్ధ—చంద్రసేనా! అస్మదాగమనంబునకుఁ గతం బెఱుంగుదువా ?

మందర—

మ కడుమగ్నాభిహ్యము హైనకార్యగతులం గన్గొమతుల్డక్కి చె
సి శిశార్యంబు గ్రహింపఁజాల కిట నీచేఁ దీఱ చిక్కంచు నీ
నడురేయిం గనుగాలుసాగి కదలంగారాని వెంజికఁటిం
బడి యే మిచ్చటి కేగుదేరవుసె స్వాకార్య మూహింపుమా

గీ నాదుజనకండు నాజ్యేష్ఠసోదరియును
వైమనస్యంబు లాత్మలఁ బాదుకొనిన
జాబు లంపిరి వేర్వేర జాగుసేయ
కుచితగతి నీయవలె వారి కుత్తరముల

వ—కాన నీవు సద్బుద్ధి నూహించి కర్తవ్యంబు నిశ్చయించి మాకుం బరమహితం బుపదేశింపుము

చంద్ర—అవశ్యము నాంనేర్చినకొలంది నట్లొనర్చెదను ‹ — —



రంగము—చంద్రసేనునినగరు ముంగిలి

[సుమిత్రుఁడును గుకింభరుఁడును వేర్వేరఁ బ్రవేశించుచున్నారు]

కు—మిత్రమా! భద్రమా నీకు? నీ విచ్చటివాఁడవే ?

సుమి—ఔనౌను

కు—గుఱ్ఱముల నెచ్చట విడియింతము

సుమి—ఆగోతిరో

కు—దయసేసి మాటు సరసముగా రానిమ్ము

సుమి—నీకును నాకును జుక్క కెదురు దయ యెక్కడిది ?

కు—అట్లేని మాయింటికి మీయి ల్లెంతదూరమో మీయింటికి మాయిల్లు నంతియ దూరము నాకేల నీయెడల లక్ష్యము?

కు—మహాప్రభూ! నాకు శ్వాస పోడకున్నది

సుమి—పాపము బలవిక్రమములు చూపి చాల డస్సితివి ఛీ సాకుబోతా నిన్ను మగవానిగా విధాత తప్పఁజేసెను

వ—మీ యిరువురకును నైర మేల పొసఁగినది?

కు—ఈ మొనకుముదుకని పలితశిరంబుఁ జూచి యీతని ప్రాణాపాయంబునకుం వెగనోడితి

సుమి—ఓరిపక్షీ! నావార్ధకము చూచి జాలిదలఁచినావఁటరా? అయ్యా! నెల వయిన నీతనిబీరంబు లడిపెద

వ—చాలుచాలు ఏల మర్యాద యెఱుంగక మాటలాడెదవు

సుమి—అయ్యా! ఆగ్రహ మెల్లరకును మర్యాదోల్లంఘనోపాధ్యాయుఁడుగద

వ—నీయాగ్రహమునకుం గారణం బేమి?

సుమి—ఈపిటికిపంద కేల గన్నట్టునావా లే చాలినంత కారణము వేరొండేల?

మ. మఱి హాలాహలము న్ముఖంబున సుధామాధుర్యముం గల్గి సం
పద వెన్వెంటను వంటయింటివెనుక న్స్వానక్రియం జొచ్చి యె
య్యది యుం దోఁచక తిన్నయిండ్ల కలహప్రారంభము ల్నాటుచుం
డెడు రీతుచ్చులు పీండ్ర యిచ్చకములం జేటొందుసంసారముల్

ఛీ! దురాత్మా నీ పీయూషవెలుపలఁ దారసించితివేని నీరూపు మాపకుందునే?

వ—ఓరి స్థవిరాధమా! నీకు మతిపోయినదా?

చంద్ర—మీకలహకారణము దెలుపుమన ఈయకాండతాండవ మేల?

సుమి—మాయిరువురప్రకృతులకును తూర్పుపడమరలకుఁ గలయంతరము గలదు. ఈమనుష్యునకును నాకును గలపొత్తు వేనీళ్ళకును వేసవికాలమునకు నెంతయో యంతియ

వ—అపరాధకారణము నిరూపింపకయ యేల వాని నింతదూఱెదవు

సుమి—వాని మొగము చూచిన నాయరికాలిమంట నెత్తి కెక్కుచున్నది

వ—అయితే మామొగములఁ జూచినను నీకట్లే యుండఁబోలు

సుమి—కన్గినమాట గట్టిగాఁ జెప్పుట నానైజము మాకాలమున మేము చూచిన తల్లులకు సాటి యీకన్నట్టు మెడలపై నొకటియుఁ గానరాదు

వ—లోకిక మిట్టిపలుగాకులను యథార్థవాదులని పొగడుటయే యిట్టిప్రల్లదనము నకుఁ బట్టుగొమ్మ. తాను మోమోడక కలరూపు వచించువాఁడఁట నేనిట్టితులువలఁబలవుఁరఁ

జూచితి జిహ్వాయందెప్పుడును యథార్థవాదప్రశంసకుం గొదువలేదు హృదయములమాత్రముకౌటిల్యమునకుఁ బుట్టినిండ్లు ఇట్టిదొకనియందు విషయవిశేషయతలతోఁబనులుసేయు సూర్వరయాం దుండువానికంటె వేయిమడుంగు లెక్కుడు కౌటిల్య ముండును

సుమి—అల్లయినచో మహాప్రసాదము భానుకోటిప్రభాభాసమాన తేజోవిరాజమానా! అవధరింపుము

వ—ఈప్రలాపమున కర్థ మేమి?

సుమి—దేవా! దేవరచిత్తానుసారము నావచోధోరణి సవరించికొనుచున్నాను కాని ముఖప్రీతుకును నాముఖమునకును సగ మెరుక నాయెత్తుధనమువోసినను నిన్ను వలయోనికి దించిన పచ్చికవాండ్ర యిచ్చకములును మచ్చులాడితనముల నా కలవడవు

వ—(కుక్షింభరునితో) నీవు వాని కేమి యపరాధ మొనర్చితివి

కు—నే నేమియు నొనర్చుటలేదు వీఁడు దుర్మంత్రమువలన వీనియజమానుఁడు నన్నుం గొట్టినాఁడు అటుపైన వీఁ డిప్పుకాలకు మరలిపోవుచున్న నన్నుం దన్ని తన్నుపడి పడియున్న నాపై నెంతయుఁ బ్రతాపము సూపి తనయజమానుని మెప్పువడసె ఇప్పు డాయుబ్బున నీయెడ నాయెడల విక్రమమున కుపక్రమించెడిని

సుమి—ఆహా! ఏమిరా ప్రజ్ఞలు ఉత్తరమునకడ కొత్తినాఁడవు

వ—బొండకొయ్యఁ దెండు వీనికండకావరమునకుం దగుచికిత్స సేయవలసి యున్నది పదరుబోతా నీయుదుటు మాన్పి యడఁకువ నేర్పెదను

సుమి—అరువదేండ్లు పైబడినవి చదువు నేర్వనిదియే యదను కాని యుచిత మారయుము మీమామగారు పుత్తెంచినమాత కిట్టిసత్కార మొనర్చి తిరిగి యాతనమో మెట్లు చూచెదవు

వ—బొండకొయ్య సత్వరముగాఁ గొనిరండు రెండుజాములవఱకును వినిపదముల గదియించి యుంచుఁడు

మం—రెండుజాము లేల పగలు నాల్గుజాములు కలయునెడ రాత్రియింతయు నుంచుఁడు

సుమి—అప్పా నేను నీతండ్రివ కిటికుక్కనైనను నన్నిట్లు చేయఁదగదు

మంద—కాని యామనుజసింహునిపాలి నక్కవగుట నిన్నిట్లు చెయవలసినదే

వ—వీఁడు చండికచె వర్ణింపఁబడినతుంటరిమూఁకలో నొకఁడయి యుండవచ్చు బొండకొయ్యఁ దెండు (బొండకొయ్యఁ దెచ్చుచున్నాఁరు)

చంద్ర—మీ రితని కిట్టిహీనదండన మిచ్చి యనుచితమునకుం జొరకుఁడు ఈతని యపరాధ మెంతదుర్భర మయినను రాజధానికిం దగుపరిహార మొనర్ప నర్హుఁడు మన మాయన యనుచరు నవమానించినచో నది రాజున కెంతయు నాగ్రహకారణ మగును

వ—దానికెల్ల నే నుత్తరవాది నయ్యెద

మంప—అంతియేకాదు తనపరిచారకునకు గల్గినపరాభవము మాతోఁబుట్టువు నకుమాత్ర మాగ్రహకారణము గాకుండునా? వీని నవశ్యము బంధింపుఁడు శంకింప నేటికి!
(సుమిత్రుని బంధించుచున్నారు) ప్రాణనాయకా! పోదము రమ్ము (సుమిత్రుఁడును జంద్ర సేనుఁడును దక్క తక్కినవారందఱు నిష్క్రమించుచున్నారు)

చంద్ర—మిత్రమా! నీయవమానము నకు నామనం బెరియుచున్నది కాని యలంఘ్య శాసనుం డగువర్ధమానుని యుత్తర్వు మరల్ప నెవరివశము అట్లయ్యు న యోచించ యత్నం బొనర్చెద

స—నేస్తమా! నీకేల యట్టిప్రయాస ప్రయాణముచే నలసిన నా కీనిర్బంధ రూప మగుశ్రమాపనోదనసాధన మమరినది నేనం గొండొక సేపు సుఖనిద్రగూరి యధ్వ ఖేదం బపనయించుకొనియెదఁగాక నీ విందులకు వగవక పోయిరమ్ము

చంద్ర—అయ్యో! వర్ధమానుఁ డెట్టి యనుచిత మొనర్చినాఁడు రా జెంత క్రోధించునో గదా (నిష్క్రమించుచున్నాఁడు)

సు—ఓవెఱ్ఱిరాజా! సుఖమునను న్న ప్రాణమును దుఃఖమునఁ బెట్టికొంటివి వియన్మంటప లంబమానరత్నదీపమా! ఇందుబింబమా! ఉదయించు మంటివా? త్వత్ప్రకాశసాహాయ్యమున నే నీలేఖం జదువుకొనియెద ఆహా! విపద్దశగదా విస్మయావహము లగునంశములకు జన్మసీమ మాదురవస్థఁ దెలిసికొని సుశీల తీరిక చేసికొని తత్పరిహార దత్తచిత్తయయి యీలేఖ నాతావున కంపినది కన్నులారా! బడలియున్నారు నిద్రాలాభముచె నాదైన్యము నుపలక్షింపకుందురుగాక భగవతి! లక్ష్మి! అనఙ్గ యొసంగుము భవదీయకటాక్షవీక్షాలాభంబు మరల మాకిగుంగాత (నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—ఒకయడవి

[శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

శ్వేత—సీ ప్రభుశాసనముఁ బూని పల్లెలు పట్టణంబులు మాడెములు కొట్టములు నగళ్లు
కానలుకోనలు ఘనలతాగుల్మముల్ గోత్రంబులను గిరికందరములు

రేయుంబవళ్లు వేరోయుచు నాతలఁ దరిగి సమర్పింపఁ దిరుగ రాజ
పురుషుల గుజగుజ ల్వరఁగ నే నొకజీర్ణతరవివరంబున దాగి వింటిఁ
గాన వారికి నామూర్తిగౌరవంబు
మరుగుపడ రొంపిమోమునఁ జరచి దిన్న
మొలకు మసిపాతిఁ జుట్టి యాదలను జడలు
ముడివడంగ నమర్చెద బూచివోలె

తే గీ వేష మీరీతి ధరియించి పెట్టివాని
పగిది వికవిక నవ్వుచు వాడవాడ
సెంగిలాకులఁ బొడగన్న నేరి మెతుకు
లోలి మెసవుచుఁ గ్రుమ్మరుచుండు నిందు

ఇఁక నే స్వేతకీర్తిని గాను పాతలభైరవుఁడను

(నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—చంద్రసేనునినగరునుంగల

[సుమిత్రుఁడు బొండకొయ్యతో నుండఁగా మందపాలుఁడు, విదూషకుఁడు,
మరియొకపెద్దమనుష్యుఁడును ప్రవేశించుచున్నారు]

మంద—నాగూఁతమ ప్రత్యుత్తర మిచ్చి పంపకయ వారలిలువెడలిపోవు టెంతయు నాశ్చర్యావహముగ నున్నది

పెద్ద—నేవిన్నసమాచారమునుబట్టి యోచింపఁగానిన్నటిరేయిపడుకను వారలకుం దావు విడులునుద్దేశము లేనట్టు స్పష్టమగును

సుమి—స్వామీ! వందనము

మంద—అకటా! నీ కీయవమాన మొకవినోదముగా నున్నదా?

సుమి—మహాప్రభూ! అట్లేలయగు

విదూ—గుఱ్ఱములకుఁ దలకట్లు, కుక్కలకు మెడకట్లు, కోఁతులకు మొలకట్లు

మంద—ప్రమత్తుఁడయి నిన్నిట్లు పరిభవించినవాఁ డెవఁడు?

సుమి—అవియును వాఁడును గూడియే యింత నేసిరి నీయల్లుఁడును గూఁతు రును గూడియే

మంద—అట్లయ్యియుండ దగు నాయనుమానము

సుమి—అట్లయెన్నవని నాప్రమాణము

మంద—అట్లేల యగు?

సుమి—అట్లే యయినది

మంద—దేవునియాన! వారొక్కనాఁటి కట్లు చెసియుండరు

సుమి—దయ్యామతోడు! నిస్సంశయముగా వారే యిట్లు చెసినారు

మంద—చేయ వారికి చేతు లెట్లొచ్చె మాఁవంతున కిట్టి యవమానముకంటె ప్రాణహాని మేలా మ మాతవగు నీ కిట్టిపరాభవంబునకుం గారణంబు నీదౌర్జన్యమో వా సౌజన్యమో శీఘ్రముగా నిరూపింపుము

సుమి - శా నీసందేశము మాళిఁ దాల్చి యిటకు న్వే వచ్చి నేఁ దెల్పుచో
నాసానాళముల న్నిరంతరగతి న్గంపించు శ్వాస ల్నిజా
యాసంబుం బ్రకటింప శీఘ్రగతి నత్యంతంబు స్వినాంగుఁడై
డాసెం జండికమోలనుండి వెనువెంట న్దూత పోత్కుయుఁడై

గీ నన్ను కడకొత్తి చండిక విన్నపముగ
జాబు లాకకొన్ని యందివ్వఁ జదివి వార
లాక్షణంబున నిల్వాసి యరుగునెడలఁ
దోడ రమ్మని సెల విచ్చి రీడకునను

నేను వారివెంటఁబడి వచ్చి యిట గిద్దురాత్ముం గని యంతకుమును నీయెడ నవినయంబు సూపిన యాచెనఁటింగా నెఱింగి, నాహృదయంబునం బొంగి పొరలురోషంబు నామనం బున దూరవిచారిబుం బొదివి మంపఁ గత్తి దూయుటయు నిప్పిఁటికిపంద భయగద్గద స్వరంబున విపర్యాసంబుగా నార్చె అంత నందఱును మూగి ననుం జుట్టుముట్టిరి నీ యల్లుండును గూఁతురును నాయందు నేరమువెట్టి యిట్టిపరిభవంబు విధించిరి

విమా—తే గీ ధనము వాసెడుతండ్రు లాత్మజుల భువిని
గడుఁ గృతఘ్నులఁ గావింత్రు కల్ల గాదు
ధనము దాఁచెడు తండ్రు లాత్మజుల ధరణిఁ
గడుఁగృతజ్ఞులఁ జేతు రీనుడువు నిజము

రాజా! నీకొమార్తెయు నీసుం జింతారత్నములునుమీా

మంద—విచారసాగరమా వెల్లిగొనకుము నాకుమారీరత్న మెక్కడ?

సుమి—ఆమె భర్తతో నంతిపురమున నున్నది

మం:—నీ విట మంకుము (నిష్క్రమించుచున్నాఁడు)
పెద్ద—ఇదియేనా నీవు చేసిన నేరము ?
సుమి-మఠేయియును లేను రాజేలయింత హ్రాస్వపరివారముతో వచ్చినాఁడు?
విమా—చాలుచాలు ఈప్రశ్నకయినను నీ వీపరిభవమున కర్హుండవు
సుమి—ఏలరా యవివేకీ

విమా—శీతకాలమున పాటులేదని తెలియఁజాలని నిన్ను చీమయొద్ద శిక్ష కంప వలెను ముక్కునను సూటిగాఁ బోయినం గన్నుగలవానిం గనుఁబడనిదేమి ? శుక్ల పక్షముం గృష్ణపక్షముం దెలియని శుద్ధమూర్ఖు లుందురా ? కొండక్రిందిగి ద్రొల్లుచక్రముం జేపట్టిన మెడవిఱుగఁబడుటయే ఫలము కొండపైకిఁ బ్రాకదాని పట్టిదారిన వ్రగ్రము జేరవచ్చును ఇంతకంటె శ్రేష్ఠ మయినయుపదేశ మొకఁడు చేసినపుడు నాది నా కప్ప గింతువు గాని లే

[మందపాలుఁడు చంద్రసేనస మేతుఁడై తిరిగి ప్రవేశించుచున్నాఁడు]

మంద—నాతో మాటాడుటకే యొుకలేదా ? ఏమీ ర త్రియంతయు ప్రయాణము చేసె డస్సినారా ? చాలుచాలు నీకృపోక్తులు నీవు పోయి నదుత్తరముఁ గైకొని రమ్ము

చంద్ర—వర్ధమానని యహంకారము మీ రెఱింగినదే కదా ! ఆతనిపట్టునకు విముఖు లేదు

మం—క పరమద్రోహులు దుష్టులు
దురితాత్ములు మోసరతులు దుర్మార్గులు దు
ర్మణం బయ్యేదు వీరికి
ని రయంబు నికృష్టజన్మనిష్ఠయుఁ దోడ్తోన్

ఏమీ అహంకారమా? చంద్రసేనా ! నీవు పోయి మందపాలుఁడు మందరావర్ధమానులతో మాటాడ నుత్సహించుచున్నాఁ డని చెప్పుము

చంద్ర—ఆసంగతియే మనవి చేసినాను
మంద—ఏమీ ! మనవియా ? ఎవరితో భాషించుచుంటివో గుర్తెఱుంగదువా ?
చంద్ర—చిత్తము ఎఱుంగుదున

మంద—రాజు వర్ధమాననితోడను తండ్రి తనయుతోడను మాటాడవలసియున్న గని తెలియఁజేసె వారిరువురి నిట రమ్మని నాయాజ్ఞ గా వచింపుము ఇది యొుక మనవి

గా జెప్పితివా? వర్ధమానుఁ డహంకార మెవరిపైఁ జూప నున్నాఁడు ఆప్రల్ల దీని యుల్లం బుచ్చిపో నిట్లాడుము తాళుము—తొందర పలవదు నిర్మయుని బోధించు విధుఁడు సామయునియందుఁ గుంఠితము లగుట న్యాయంబకదా శరీరము వ్యాధిపీడిత ము యుండునప్పుడు బుద్ధివికాసము వీడియుండును కావున నాయుద్రేకమునకు శాంతి చెప్పకొనియెద (సుమిత్రునివంకఁ జూచి) నాయధికార మేలఁ గాల్పనా? వీఁడేల యీలీల నవమానముపాలు గావలెనె? బాగుగా విచారింపఁగా నిల్లు వదలివచ్చుట మొద లుగ వీరిచర్య లన్నియు దురుద్దేశపూర్వకములగాఁ దోఁచుచున్నయవి ఈక్షణంబ నా కింకరునకు విడుగర యొసంగి వారిరువుర నాశ్రమోల నిల్పుము

చంద్ర—నాశక్తియుక్తుల వినియోగించి సాధ్యమయినంతవఱకు మీకుఁ బొం దొనగూర్ప యత్నించెదను (నిష్క్రమించుచున్నాఁడు)

మంద—హృదయమా! శమింపుము

విదూ—క్రింద యెసరుపెట్టి పైన నీళ్లు చల్లము

[వర్ధమానుఁడు మందర చంద్రసేనుఁడును బరిచారికులును ప్రవేశించుచున్నారు]

మంద—మీయుభయులకు నాయుస్సగు

వ—వందనము (సుమిత్రుఁడు విడువఁబడుచున్నాఁడు)

మంద—భవద్దర్శనచంద్రోదయము నా లోచనచకోరంబుల కెంతయు సంతో షావహముగ నున్నది

మంద—అస్మజ్జాత వగు నీకట్లుగా కెటు లయ్యెను (సుమిత్రునితో) స్వేచ్ఛఁ బడసితివిగదా? నీసంగతి కావల వచ్చెదను అమ్మా మందరా! నీతోఁ బుట్టినవు కేవలము వ్యర్థురాలు కానికృతఘ్నత పాముకోరలవలె (హృదయముఁ జూపుచు) నిట నాటినది సుమీ ఆమె దుర్నయము వర్ణింప నాకు నోరురాదు నీవీనులును విననొల్లవు

మందర—అయ్యా! ఓపిక సేయుఁడు మీ రామె యవజ్ఞమాట యటుండనిండు తత్స్వభావానభిజ్ఞతచె మీ రింత చేసియుందురని నా యూహ

మం—ఏమీ నీయభిప్రాయము?

మందర—నాయగ్రజాతకృతఘ్నురాలయి యుండదు తనగృహసంక్షోభోప శాంతికయి యీతుటరిమూఁకను ప్రాగ్వపతిచిన నామెయం దవేటి దోషమగు?

మం—ఆరాకాసిమారిబారిం బడుఁగాక!

మందర—అయ్యా! అయ్యా నీవు కాలముతీరి కాటికిఁ గాళ్లు చాచుకొని యున్నావు నవనాళ్లును గిగియుంటివి నిన్నోరులు నీక్షేమమును గోరువారు నడప

వలపియున్నది కావున నామాట విని నాయకన్సన్నిధికిఁ బోయి జరిగినదానికిం బరిహారము సేయుము

మం — ఆమెయొద్ద నిలిచి "అమ్మా! నేను మా దుకాళ్ళకుదుసలిని వృద్ధుఁడను ఏలాగునో కూఁతుగుడ్డ్రలిచ్చినా ముప్పు గడుపుము" అని వేఁడుమంటివా? అది మన కుటుంబగౌరవమున కెంత యనురూపమో, ఆమె కెంత శ్రేయోదాయకమో నీవే విచారింపుము

మంపర — అయ్యో! చాలు నిఁక మాటలు కట్టిపెట్టి యామె యొద్దకు జాగుసేయక వెడలుము

మం — ఉ॥ ముక్కున యూపిరుండ నలమూర్ఖశిరోమణిపాలి కేగి యే
దిక్కును లేనివానివలె దీనతఁ గాలముఁ బుచ్చు బెట్టు లా
యుక్కువురాలు నాభటుల నూరక నేరము వెట్టి సాముగా
నక్కట! చేసె దాని కిల నాయువు శ్రీయును జెల్లకుండునే

మ — అయ్యో మీ కిటులాడ నోరెట్లు వచ్చినది

మం — మ॥ అశనిప్రాతము దానిమస్తకము వ్రయ్యం దాకకున్నాదుదు
ర్దశ లెల్లం గుమిగూడి యట్టులయి తన్నస్తంబున వ్రాలె నా
దిశల న్నేచక దేహకాంతు లాలయక్ దృష్టాంత నాశ్వాపదన్
గశల న్మోదుచుఁ గాయదూతయు యమాగారాతిథిం జేసెడున్

మంపర — హరిహరీ! నివ్వారిముల్లంత తప్పినచో నాగతియు నిట్టిదకద

మం — అమ్మా! నివిషతుమయి యట్లేల సంభవించు ఈసేమ ఖవర్చస్సామె దాని వలెఁ దీక్ష్ణముగాక దయారసముఁ జిలకుచున్నది ఆమెవలె

మ॥ పరివారంబు సగిం బొనర్చి పటువాక్పారుష్యముం జూపి మ
త్పరమప్రీతికరంబు లౌ పనులకు న్భంగంబు గావించి యా
గర మొక్కింతయు లేక యి ట్వెలవడ న్ద్వారంబు బంధింప నీ
తర మా టెట్లు దయాశమాదిగుణభద్రాప్రతికారత్నమా!

మంపర — చిత్తము ప్రకృత మనుసరించి పలకుఁడు

మం — నాభృత్యు నెవరు బంధించిరి? (లోన తూర్యధ్వని)

మ — ఆతూర్యము లెవరివి?

మంపర — నాడు గృహస్థే మాయక్కగారివి వ్రాసినట్లే యామె విచ్చేసినది

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మీప్రభ్వి యెక్కడ ?

మం—ఈ బానసీని కతిచన విచ్చి యింత మితిమీర నిచ్చినారు ఛీ తుచ్ఛుఁడా పొమ్ము నాకనలం బడకుము

వ—దేవరవారి కంతయాగ్రహ మేల ?

మం—ఎవరు నాసేవకుని బాధించిరి మందరా నీవు గావని నానమ్మకము (చండిక ప్రవేశించుచున్నది) దైవమా! ఎవరీప్రవేశించువారు నావార్ధకమందు నీకుచ క్షీణ్యముండిన రిప్పాపాత్మ న్విడనాడి ననుం జేపట్టుము (చండికతో) నానెరిసినగడ్డముఁ జూచిన నీకు సిగ్గుపుట్టదేల ? ఏమీ మందరా నీ వాపె చెట్ట పట్టుచుంటివా ?

చం—ఏల పట్టరాదు ? నావల్ల నేర మేమి ? జరాచాపల్యముచె మతిదక్కి నీవు నిరూపించిన దెల్ల నేరమగునా ?

మం—హృదయమా! వ్రయ్యవేల ? నాయనుచరు నెవరు బంధించిరి ?

మందర—అయ్యా! నేను అతని నేరమనుబట్టి చూడఁగా నేను జాల దాక్షిణ్యము నే గనుపఱచినట్లు తేలఁగలదు

మం—నీవా బంధించితివి ?

మందర—అయ్యా! దయచెసె యీరుంగోపము చాలించి మరలి చని నిలిచిన యీసగము పరివారముతో నాతోఁబుట్టువునొద్ద నీమాసావశేషంబుం బుచ్చిరమ్ము నా కిప్పు డీపరిస్థలమున నీకర్హ్వాసత్కారి మొనర్ప నవకాశము లేదు

మం—సగము పరివారమును డించి యీ మెకాళ్ళఁ బరువ ంటివా ?

మ గృహవాసంబుఁ ద్యజించి కాన మునిభంగి న్శీతవారాతప
ప్రహతిన్నైనతు మహోగ్రసింహశరభవ్యాఘ్రాదిదుస్సత్వదు
స్సహదంష్ట్రాహతిఁ జత్తు సిగ్గటి యజస్రం బానుశీలాపలిక్
బహుళాయాసము చేసి కొల్తు వసియించఁ జాల నాకూళతోన్

చం—అట్లయిన నీచిత్తము

మం—నాకుఁ జిత్తవిక్షేప మొనర్పకుము నీ నాయెడలఁగల యనుబంధములు నేఁటితో సరిపెట్టికొందము మనకుం జూపు లింతటితోఁ జెల్లఁగాక సరియేకాని నీవు నారక్తమాంసములవలన నేర్పడిన తనూజాత వగుట నా కత్యంతంబును షమత్వపాత్రం భవు ? దానికేమి దుర్మాంసమును వ్రణము నీదృశమ్ములేకదా నిన్ను నిందింప

నేల లోపముండుపట్టునం గాలాంతరిమునం బశ్చాత్తాపము తనకుందాన యుదయించును అట్లు గాకుండిన నేకట్టును నిల్పుండిన నాకట్టురో యంటుకొనుగాక ఒరులకుం గీడు గోర నాకేల? ఈపూర్వపు పరిజనులతోడను నేను మందరపాల నండెదను

మందర—మీ రెంతమాత్రము నట్లనం గొనంజనదు నే నిప్పటికి మీరు కడు నిరీక్షించుకొని యేమియు సిద్ధపరచుకొనలేదు కావున నాపునవి విని మీరు నాయక్క యొద్దకు మరలి చనుండు ఇప్పటి మీభంగిం జూచిన నిది యంతయును మీజరాచాపల్యమే కారణముగాం గన్పట్టెడును ఆమెవిదు లామె యెఱుంగదా?

మం—ఉచితానుచితము లరసి పల్కుము

మందర—మనఃపూర్తిగా నట్లరసియే పల్కుచుంటిని ఏంబదుగురు పరిజనులు నీకేలం జాలదు? ఏకాగారంబున బహునాయకానువర్తులగుపలవురు పరిజనులకుం బొందుపొసంగు టెట్లు?

చం—నాపరిజను లుండం బెరజనులతో నేమిపని? పనియుండిన నిం దెవరివలనం బనిగొనరాదు

మందర—ఔనా నట్లేలం జేయరాదు వారలయందలి ప్రమాదాలస్యాదులకే మర్ష్యాదండన మొనర్చువారము కావున మీరు నాయొద్దకు వచ్చునప్పుడీయిరువదియైదుగురిని వెంటంగొని రండు అంతకధిక మయిన ననర్థము లనేకములు పొడకట్టుచున్నవి

మం—నాసర్వస్వమును మీయధీనము సేసితిని

మందర—ఉత్సాహము జనించిన నట్లు సేసితివి

మం—నాకును నాసర్వస్వమునకును మిమ్ము సంరక్షకులంగా నంగీకరించునెడ నీ స్వల్పపరివారముమాత్రము నిల్పుకొంటిని అట్టి నే నిప్పుడు వీరిలో మువ్వాతికపాలు గోలుపోయి నీపాలికి రావలయునా? ఇట్టిమాట నీకుం బోలునా?

మందర—పోంకేల?

మం—లోకములో బట్టను మ్రింగువానికంటె గొట్టను మ్రింగువాండు మేలు (చండికతో) ఆమె యిరువదియైదుగురికి నీయేంబదుగురు ద్విగుణము గాన నీపాలికే వచ్చెదను

చం—అమ్మా! నావిన్నపము వినుము ఏంబదిమాట యటుండనిండు మీ కిరువదియైదుగురుగాని, పదుగురుగాని, యేవురైననంగాని యేలవలయు? మీయాజ్ఞ కెదురు మాటమ నాపరిజనులు వేవురుండ నొరు లేల?

మందర—ఒకండైనఁగూడ ననావశ్యకము

మం—ఆవశ్యకతకు వ్యవస్థ యేడ? అది విచారించినచో క్షుద్రుఁడగునంకిచునని వేషమున నతిక్షుద్రమయినదానియందుఁగూడ ననావశ్యకత సమర్థింపవచ్చును జనుల యీప్సితము లావశ్యకత మించకుండునేని లోకమున జనులకు జంతుకోటికివలెనే ఘట యాత్ర బహుసులభసాధ్యమగును ఆచ్ఛాదనముననే పరిధానప్రయోజనము పర్యాప్తం బగునేని, ఆయాచ్ఛాదనమును సమగ్రముగా నొసంగని మీయమూల్యాంగవేష్టనముల యావశ్యకతను మీ రెట్లు సాధింపగలరు? నాకేల మీతోడ నింతయుక్తివిహారము దైవమా! జరాజీర్ణశరీరుండనై, దుఃఖోద్విగ్నమానసుండనై, యాధివ్యాధిపీడితుండ నగు నాకు క్షమం బ్రసాదింపుము కానిచో నాహృదయంబున బలాజనోచితదైన్యంబునకుఁ బాల్పడక పురుషజనోచితరౌద్రావేశవశం బొనర్చి యాకృతఘ్నుల యక్షమదండనవిధాన సంరంభంబునకుం బురికొల్పుము అట్లయిన నీపాపకర్మరాండ్ర రూపుమాపు ఘోర కర్మంబుల నాకసిదీర నొనర్చి లోకమునకు బుద్ధి సెప్పెద కాక నాకేల నిట్లు జేల పడ విదూషకా నాచిత్తము చంచలించుచున్నయది (రాజు, చంద్రసేనుఁడు, విదూషకుఁడు, సుమిత్రుఁడును నిష్క్రమించుచున్నారు గాలియు వానయుఁ బ్రారంభించుచున్నది)

వ—గాలివాన పట్టుచున్నది లోనికి రండు

మందర—ఇల్లు చిన్నదిగా నున్నది రాజు పరివారంబునకుం జోటు చాలకుండి యుండును

చం—ఎవరు చేసికొన్నది వా రనుభవింపక తీరదు

మందర—అతఁ డొక్కఁడైన గ్రహింతునుగాని యింకెవనిం గొనను

చం—నాయభిప్రాయము నంతియ చంద్రసేనుఁ డేడ?

మం—తనప్రభువువెంట జని యదె మరలి వచ్చుచున్నాఁడు (చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చం—రాజు రౌద్రావేశవశుండయి యున్నాఁడు

వ—ఎట కేగనున్నాఁడు

చం—ఎట కేగనోగాని గుఱ్ఱముల సిద్ధము సేయించుచున్నాఁడు

వ—ఆయనచిత్తవృత్తిని నిర్నిరోధముగ సాగనీయవలెను

చండిక—చంద్రసేనా! ఆయన నెన్నటికిని బ్రతిమాలకుము

చం—రాత్రియయినది గాలివానసాగినది మాపు మీరలో చెట్టును బుట్టయు లేక బట్టబయలుగా నున్నది

మం—బుద్ధిపూర్వకముగఁ జేసికొనువారికిం దమచెయ్వులెల్లయుతే హితోపదేశకములుగాఁ గలయవి ద్వారము బంధింపుఁడు ఆతండు దుష్టపరివేష్టితుండు చిత్తము చపలస్వభావము లోఁ జొచ్చిన నేమి యెచ్చునో

ఏ—మంపరపలుకు లెంతయు నుచితంబులు ద్వారము బంధించి రక్షింపవలెం బునవుం దోలంగూడదు

(అంతట నిష్క్రమించుచున్నారు)



శ్రీ

# మందపాల చరిత్రము.

## తృతీయాంకము

రంగము — ఒకబయలు

[గాలివానలో సుమిత్రుఁడు ప్రవేశించుచుండఁగా నొక పెద్దమనుష్యుఁడు
వచ్చి చేరుచున్నాఁడు]

సు — ఈగాలివానకుఁ దోడెవ రిక్కడ మసలుచున్నారు

పె — ఈబహిఃప్రకృతిలోవలెనే యంతఃప్రకృతిలో సంక్షోభము నొందుచుండు నొకఁడను

సు — నేను గుర్తించితిని ప్రభు వెక్కడ?

పె — ఈమహాభూతసంక్షోభముతోఁ బెనంగుచు భూమినెత్తి సముద్రమునఁ గలిపి యొండెను గానిచో సముద్రమునెత్తి భూమినిముంచి యుండెడి నీదుర్నయప్రపంచప్రలయ మొనర్పుమని ప్రభంజనుం బ్రార్థించుచు నీభూతములకంటె రౌద్రతరమగుమూర్తివిశేషము దాల్చి శిరోవేష్టనము నంగరక్షయులేక తెరువునఁ జొచ్చి ఘాతుకమృగములునయితము పొడసూప వెఱచు నీనడిరేయిం బెన్బయిట విడిసియున్నాఁడు

సు — ఆయనతోడ నెవరున్నారు?

పె — ఆయన హృదయాంతశ్శోష మొనర్చునుప్పెగిమ్ముహాస్యా! ప్రీకుం దనమృతి నివ్యాంపముచే శాంతి యొనరింపఁ జూచు విదూషకుఁడు దక్క నొరు లెవ్వరును లేరు

సు — నిన్ను నెఱుంగుదు భవత్పరిచితచరిత్రసంభంబున నిన్నొక్క దౌత్యంబున నియోగింపం గుతూహలం బయ్యెడు వర్ధమానసితధ్వజాలకుం గలతలు బలవయ్యెనుగో ప్యముచె వెల్లడిగాకున్నయవి కాని వారల పరిజనులదౌర్మంత్ర్యమువలన వారికలహాగతులు సదయహృదయుఁడగుప్రభువును వారొడంబఱచిన పరిభవము నింకనుం గల రాజ్యకార్యరహస్యములను యెప్పుడిపప్పుడు విపరీతముగా మాళవేశునికెఱుఁగింపం బడుచు నే

యున్నవి అట్లొకటంజేసి నీతివిశారదుం డగు నిష్ఠశివుండు రహస్యప్రయాణంబుల సేనల యమునాకచ్ఛంబున నిగూఢగతి న్విడియించి తోడ్తోన బయలువెడలయ నవకాశము వేచియున్నాఁడు నన్ను విశ్వసించి నీ వాసేనానివేశముం జేరి రాజునకు చిత్తాపస్మారకారణం బైన యీన్యూనత సవిస్తరంబుగా విన్నవింతువేని యిహపరంబుల రెంటను ధన్యతం గాంతువు

పె—మీ రింత విశ్వసించిన నే నేల విశ్వసింప కుందును?

సు—అట్లయిన నిఁక మాటలేల? ఈక్షణమే బయలుదేరుము నీకనలంబడు నీ నికృష్టదేహికి భిన్నుండఁగా నిన్నుంగ్రహించుటకై యీధనకోశంబుం బ్రమాణంబుగాఁ బరిగ్రహింపుము నీవు సుశీల కనులంబడినప్పుడు నీవీముద్దుటుంగర మామెకుం జూపిన నీ కవగతుఁడుగాని యీయాచించినవేషధారియొక్క కులగోత్రంబుల కెఱుఁగ నామె నీకుం దెల్పెడు బిట్టుగురియు నిష్పాపిష్టివృష్టింబడి ప్రాణములు గడవట్టుచున్నవి నేఁ బోయి ప్రభువునేమ మారయవలెను

పె—మహాప్రసాదము నాకనుజ్ఞయొసంగుఁడు ఇంకను విన్నవింపఁగల వేమేని యున్నచో సెలవిండు

సు—చెప్పమాటలు పెక్కులేవుగాని చేయఁగార్య మెంతైనఁ గలదు

(వేర్వేర నిష్క్రమించుచున్నారు)



రంగము—బయట మఱియొకచోటు గాలివాన సాగుచున్నది

[మందపాలుఁడును విదూషకుఁడును ప్రవేశించుచున్నారు]

మం—చ తరువులుగూలవీచుతను దారుణభంగి సమీరణుండు చం
దురు గబళించి కార్మొగులుతోయములం భువి ముంచుగాత వి
స్ఫురిత తటిల్లతాతతులు చూడ్కులకుం మిఱుమిట్లు గొల్పుతం
ధర నురుమాడుగాత ప్రతతం బగుపిల్లల పిడ్గుతండముల్

వి—ఓయిరాజా! అభిమానమునకుంబడి యీబయిట నీజడిమడియుటకంటె వారలపాలఁబడి తలదాఁచికొన సెలవు వడయుము ఈపాడుగాలివాన నీయట్టిబుద్ధిమంతులను గాని నాయట్టిబుద్ధివిహీనులను గాని సరకుగొన కున్నయది

మం—చ కురిసెడుగాక పిడ్గుగమిగోత్రసువృష్టి యఖండధారగా
దొరిగెడుగాక మీఱొడల దోషము వెట్టు ఘనంబులార నా

కరితురగాదిసంపదలుగాని వసుంధరగాని మీకు నే
నరణ మొసంగలే దిల దయామతి నన్నని రక్ష సేయుమీ

చ శిరమున భారమెన్నగను జమతలంతియు లేదుగాని ము
ష్కరులగు నాదుపద్ధతులకక్షి నె జేరి జరాభరంబునం
గరిము గృశించి చిక్కి ఐడి కాటకిఁ గాల్గవ సాచు నాపయిం
బరవస మిట్లొనర్చుట నవస్యభవద్ఘనతానురూపమే

విదూ—కలద ఁచికొనుట కిల్లుగలవానికి శిరస్త్రాణముతోఁ బనియేమి?

మం—నాబుద్ధికి బుద్ధి చెప్పకొని యోరిమిదాల్చి యూరకుండెద

[సుమిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సుమి—ఎవ రక్కడ?

విదూ—వివేకియు నవివేకియు

సుమి—మ అకటా ప్రానతవైరివీరిమకుట నర్ఘస్ఫురద్రత్నగాం
తికలాపామలదీపికాచయసమున్నీరాజితాంఘ్రిద్వయీ
ప్రకటశ్రీయుతినోలగంబుల వసింపంగన్న నీ కియ్యెడన్
వృకభల్లూకములుం జారస్వైరము పెన్వృష్టిన్ నిశిం బైట నా
రక నిల్వన్ వలసెం బురాకృతము దుర్లంఘ్యం బదే వారికిన్

శా ఈసీరంధ్రనిరంతరాంబుపతనం బీవిద్యుదున్మేషణం
బీనిర్ఘాతపరంపరావిలసనం బీమేఘగర్జారవం
బే సెన్నండును బుద్ధితెంగి కనలే దెందున్ మహావిస్మయా
ధీనం బయ్యెడు మన్ననంబు పెనుభీతి న్నేను గంపించెడున్

ం—సీ ఈభూతసంక్షోభ మిట్లు గల్పించిన దేవతలార మీద్వేషు లిపుడు
మీప్రభావం బాత్మ మెచ్చి పశ్చాత్తాపతప్తులౌదురె గాక తల్లడించి
ఘోరదుష్కృతముల గుటిలులై మది నిల్పి ప్రభుదండనము దాటి పాపులెల్ల
సెదలఁ గాయుష్యముల్ సదుటి భస్త్రతిపుండ్రకరేఖలను గప్ప సకలఖలులు
చౌర్యముల్ గూటవృత్తులు జారతయును
హత్యలాదిగ గనుగప్పి యాచరించి
సుఖముగను భ్రాంతి మనియెడు నఖిలజనులు
వంచవలు వీడి వేఁడు డీశ్వరుని నేఁడు

సుమి—అరక్షితం బగునీరంబేల యీయనంతతధారాపాతంబున కొగ్గెదవు? ఈ చేరువ జీర్ణగేహంబున్ జేరి విశ్రమింతువుగాక ఆగృహస్థుల హృదయము లాగృహ కుడ్యగతశిలాసంఘాతంబుకంటెను కర్కశతరంబులు ఏనిన్నన్వేషించుచు వచ్చునప్పుడు వారలఁ జేరి ఎంత పిల్చినను పల్కఁ దీయరయిరి నేనప్పటికి మున్నుగాఁ బోయి వారినిర్దయహృదయంబుల కొంత సౌహార్దంబునకుం బదనుపరచెద

మం—నాచిత్తము చలించుచున్నయది విదూషకా! రమ్ము గతిలేనివానికి గంజి పానక మయినట్లు నీవు నా కిపుడు పరమాప్తుఁడవును, కేవలబంధుఁడవు నయితివి నాహృదయము నాఁకిఁ గల్గినసంతోషములో నీదురవస్థయుమాత్రము కొంత స్మరించును గాని కడమయంశముల నన్నిటిని పూర్ణవిస్మృతిపాలు చేసినది ఏదీ యాజీర్ణగేహము?

విదూ—కాలము తప్పివచ్చినప్పుడు కాలోచితవర్తనమున కొడికట్టవలెను

మం—సత్యమురా పామరీ! ఏడ నా గేహమేడఁ

(అందఱును నిష్క్రమించుచున్నారు)



రంగము—చంద్రసేనుని నగరు

[చంద్రసేనుఁడును దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు]

చంద్ర—దోషాకరా! ఈదుర్ణయము తలఁచిన నాతల కంటకించుచున్నది పాపమాపతితశిరస్కునిపై యనుకంప దోపఁ నేఁ బల్కినంతమాత్రాన నాయింటికి నాయాజమాన్యము నిచ్చి నాళనులఁ దమస్వాధీనము చేసికొనిరి ఇఁకమీఁద నే నట్టిప్రశంసకుఁ జొత్తునేని నేను తమయమోఘాగ్రహంబునకుం బాత్రుండ నగుదు నని పల్కి నన్నాప్రసక్తినుండి సత్వరంబు విరమింప శాసించిరి

దోషా—అహా! ఎంతవిపరీతము పశుప్రాయులుగాఁ దోఁచెడిని

చంద్ర—పెక్కు భాషింపకుము వర్ధమానసితద్విజులకు వైరములు పొసఁగినవి ఇంతకంటెను గొప్పమోసము మరొకటి జరుగుచున్నది నా కావిషయమయి వార్త వచ్చినది ఇది పరమరహస్యము జాబు నాపెట్టెలోఁ బాతియుంచినాను రాజునకు జరగిన యవజ్ఞకుఁ బ్రతీకారమొనర్ప మాళవబలంబులు కొన్ని మనరాష్ట్రమున విడసియున్నవి సన్నాహము సర్వమును సిద్ధమయినప్పుడు మనము ప్రభుపక్షము నవలంబింపవలయును నేను ప్రస్తుత మాయనను రహస్యప్రకారంబునం గని యథోచితముగా సత్కారంబు నెరపెద, వర్ధమానునియొద్దకుం బోయి రహస్యంబు బయలుపడకుండ

సంవర్ష్యోచితముగాఁ బ్రసంగించుచుండుము స్తుతిగతుల నరయుచేని నే నిదురించుచుంటి నని యుండెడి, దేహస్పర్శము దక్కియుండినని యుండెడి జెప్పెదవుగాక నే నీ జోక్యము పైఁ బెట్టుకొనిన నాకు మరణదండన విధింతు మనిరి ప్రాణహాని యైనను వార్ధకమునం బ్రభువు కష్టములకుం గాకుండునా? దోషాకరా! రానున్న సంక్షోభములలో జాగరూకుఁడవై మెలంగవలెను (అని నిష్క్రమించుచున్నాఁడు)

దోషా—ప్రసిద్ధమగు నీప్రభుసత్కారమును పేటికాంతర్నిక్షిప్త మగు నాలేఖా వృత్తాంతమును గూడ వర్ధమానునకు నివేదించి ఆయనప్రసాదమునంబడసి యీమదుకని సర్వస్వమునకు సేనస్వామి నగుదునుగాక ఒకని యస్తమయముగదా మఱియొకని యభ్యుదయమున కవకాశ మొసంగుచున్నది

(నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—జీర్ణగేహము నెదుట

[మందపాలుఁడు, సుమిత్రుఁడు, విదూషకుఁడును ప్రవేశించుచున్నారు]

సుమి—ఇదియే గృహము దయచేసి యిందుఁ బ్రవేశింపుఁడు గాలివానదెబ్బఁ దల వాయుచున్నది

మంద—నాజోలికి రకుండుఁడు

సుమి—నామనవి విని యిందుఁ బ్రవేశింపుము

మంద—హృదయమా! అవియుచుంటివా?

సుమి—నా హృదయ మవియుగాక! మీ రిందుఁ బ్రవేశింపుము

మంద—ఈదారుణవృష్టి శరీరమునకుఁ జేయుపీడ నీ శోకఘనముగా నెంచుచుంటివి నీ కష్టే యయియుండును అధికార్తి గందువని కిట్టియల్పపీడ నాఁటుటెట్లు? భల్లూక మభిముఖ మయినప్పుడు నీవు మరలి పారిపోతువుగాని నీవెనక మిన్నందిమొరయుసముద్ర మడ్డముండినచో భల్లూకము వాతఁ బడుటయే శ్రేయమని యెంతువు మనస్సునకు ప్రశాంత మొదవియున్నప్పుడు శరీరమునకు సౌకుమార్యము సాగును హృదయవీధి ఘనసంక్షోభము సాగినప్పుడు వినువీధి ఘనసంక్షోభ మెవఁడు పాటిసేయును హా! జనకద్రోహామా! నీనోటి కన్నము నందిచ్చు హస్తమును దెగఁగొరకుటగదా నీకు పరమధర్మము బెలవయి కంట తడిపెట్టనేల దీని కర్మదండనమును సంపాదించెను కటకటా! ఇట్టిబెట్టిదపురేయి నన్ను విడనాడితిరే! ఓచెండికా! ఓమందరా! ఆతలంపు స్మరణమందే రాదు చిత్తము చంచలించెడును

సుమి—అయ్యా! దయచేసి లోన కరుగుము

మంద—నీవు ప్రవేశించి తల దాఁచికొనుము  నా కీవర్ష మే యుపకారకారకముగా నున్నది  నాకు చిత్తచాంచల్య మొదవింపఁజాలు విచారాంతకముల కవకాశమీకున్నయది  కాని నీకునయి నేలోని కరిగెన  ముందు విదూషకుఁ బంపుము

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చ అకటకటా మనం బెరియు నాకటిఁ జెత్తుకైన లేక పే
లికలు మొలం ధరించి ధృతి లేశము వాసి పకళ్లు రేలు నూ
రిక పురవీథులం బడి నిరంతర మాతపవాతవర్ష బా
ధకుఁ దల దాఁచగా నెలవు దక్క చరించెడువారి నెంచినన్

చ కలిమిని గన్నగానక జగంబున దీనులయార్తి నంతయున్
దెలియక దీర్ఘకాల మిటు దృప్తుఁడనై వృథపుచ్చితిన్ దుదిన్
గలిమి దొలంగి కష్టములు నాటిన నచ్చెడు తథ్య మెల్ల నీ
యిల మనుజాళి కాపదలహీనహితప్రతిపాదకంబులా

[శ్వేతకీర్తిలోనుండిజయభైరవా (విదూషకుఁడు పైకిఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు)]

విదూ—రాజా! యిటు రాకుము లోన భూత మున్నది

సుమి—నీప్రాణములకు నాప్రాణముల నడ్డపెట్టెదను ఎవరు లోపల?

విదూ—భూతము పేరు పాతలభైరవుఁడఁట

సుమి—ఈగడ్డిలో నేమి నెమకుచున్నావు? వెలుపలికి రమ్ము

[ఉన్మత్తవేషముతో శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

శ్వేత—పిశాచమా! తెగటారుము ఎవరమీరు? ప్రాణముల కాశించుచేని తొలఁగి చనుండు

మం—ఏమి? నీసొత్తెల్ల పుత్రికల కిచ్చి యీదుస్థితి జెందితివా?

శ్వేత—ఈభైరవున కేమయిన దానము చేయువా రున్నారా? వీని నొక బ్రహ్మరాక్షసి బలంబుల మంచి మంట నార్చి అడుసున నడిమి యంతబోక పడకక్రింద గల్లెమును బ్రక్కను బాకులు నొడ్డియు గంజిలో విషము గల్పియు నిద్రించునెడ గొంపోయి కొండకొనలను బెట్టి కొమ్మలను నిల్పియుఁ బల బాధలు పెట్టుచున్నది

మంద—ఏమి యీపాపము! కూతుం డ్రీతని నీస్థితికిఁ దెచ్చిరి కాఁబోలు ఓరీ! కాసయినను నిల్పికొనక కడగిపెట్టితివా?

విదూ—అదిగో మెల కొక్కకంబళి నిలుపుకొని తనమానమును మనమానమును నిల్పినాఁడు

మంద—నీకొమార్తె మరి గొంపోవుగాత

వి—వానికిం గుమారుండు లేఁడు

మం—లేనిచో వీని కిట్టిదుర్దశ యెక్కడిది? ఓరీ! నీపుట్టుఁబూర్వము లేమిరా?

శ్వేత—నేనను బూర్వము పెద్దలపరిచర్య చెయుటెడ మానము విడిచిప్పి తల కుచ్చుకుళాయియు వంటికి మెర్గటంగియు దాల్చి తిరిగినవాఁడనే స్త్రీలోల్యమునఁ బరాచుల బరిహసించితి పానాశక్తిపాశ్చాత్యులఁ దిరస్కరించితి

మం—ఏమయినను నేమి నేటి కీగతి ప్రాప్త మయినదిగదా! వానిం జూడుఁడు పుట్టినవాఁడు పుట్టినట్లున్నాఁడు పరులుబుణ మీతనికి కాసంతయును లేదు వీనికయి యూర్ణనాభిపట్టును అజావులన్నియు శుక్తికముత్యములును పునుఁగుపిల్లి పునుఁగును కస్తూరిమృగము కస్తూరియు నొసంగుటలేదు వసనాచ్ఛాదనాదివిరహితుఁడై పట్టుకారు వలె రెండుగాఁ జీలినకోళ్లతో నెట్టు గన్పట్టుచున్నాఁడో చూడుఁడు మనకుమాత్ర మేం యీకొడుగులు సడలింపుఁడు (అని తనవలువ లొల్చుచున్నాఁడు)

వి—రాజా! ఉపశమింపు ముపశమింపుము చూడు అల్లది కొఱవిదయ్యము వచ్చుచున్నది (కఱ్ఱదీపముతోఁ జంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

స్వే—ఈదయ్యము రెండవజాముస లేచి కోడికూఁతవఱకును దిరుగుచూ పిల్లలకు మెల్లకండ్లును ప్రేఁవంబెనవులన, కుక్కలకు వ్రేలంజెవులన, మేకలమెడలఁ దప్పచన్నులుర్, వరిచేలకు దూపరకంకులన, కొబ్బరిచెట్లకు దయ్యపుకాయలన, గల్గించుచుండును.

సు—ఎవరావచ్చువారు?

చంద్ర—మీరెవరు మీపేళ్ళ సెప్పుఁడు

స్వే—పాలభైరవుఁడు నాపేరు చిరుకప్పలు, బోదురుకప్పలు, ఎల్లలు, నాకాహారము నాకడుపు గ్రోలి కాలరుద్రుఁడు మండుచున్నప్పుడు నాకు గోమయపిండముల పూపములు చచ్చినఎలుకలును, కక్కలును, పిండివంటలు పసరుగలసిన పాడుపల్వలము లోని యుదకము పానకము

చంద్ర—మహాప్రభూ! వీరిం నీయనుచరులు

స్వే—పాతలభైరవునికంటె పెద్దమనుష్యులందురా!

చంద్ర—మహాప్రభూ! మనముగన్న సంతానము మనశరీరమునుండె నిష్పన్నమైన దుర్మాంసముతోఁ దుల్యమై మన కెగ్గుదలంచు చున్నది

స్వే—నాగుండె ఝల్లుమనుచున్నది

చంద్ర—దేవా! నాతో విచ్చేయుము నిన్ను వెలిబుచ్చి ద్వారము బంధింప వలసినదిగా నీకూఁతుండ్రు నన్ను శాసించిరిగాన నావిధినే గుర్తెఱిఁగి నిన్ను వెదకొనుచు వచ్చినాను నాతో విచ్చేయుదువేని భోజనపానాదిసంపన్న మగు నొక తావునకున్ గొంపోయెద

మంద—మొదల నన్నీతత్త్వజ్ఞునితో సంభాషింప నిందు విడుగులకేమి కారణము

సుమి—నామనవి విని వారిప్రార్థన నంగీకరించి యాయనతోఁ జనుము

మంద—ఈజ్ఞానితోఁ గొంత మాటాడవలసియున్నది మీరు ప్రస్తుతము చేయు విచారమేమి?

స్వే—పిశాచములఁ దొలంగించువిషయమున, మూషికాదుల సంహరించు విషయమున

సుమి—రమ్మని బలవంతపెట్టుము అతనిమతి చలించుచున్నయది

చంద్ర—అది యాతనిదోసమా! తుంటవలగు నాతనికూఁతుండ్రాతని యసువులకు బాప పనుకట్టుచున్నారు హా! సుమిత్రుఁడా! నీ విష్వ డెచ్చటనుంటివోగదా కినాటి నీవచనములు వేదవచనము లయి నేఁడు గన్పట్టెడు ఈరాజు మతిచెడునని చెప్పియుంటివి ఇతనికేకాదు నాకును మతిపోయినది నాకూర్మితనయుఁ డొకఁడు నా యుసురుకొన సమకట్టి తనయుద్యమము వెల్లడి యయినం బలాయితుం డయ్యె వానిని మదనంతరకర్తృత్వంబునకును రాజరాక్షణకును బాపి తన్నిగ్రహార్థము రాజభటుల నియోగించితిని

స్వే—నాయొడలు వలిదాకుచున్నది

చంద్ర—లోనికిం జని చలికిం దొలంగుము

మంద—అంతరము ప్రవేశింతము

సుమి—అయ్యా! యిటురమ్ము

మం—ఏడీ నాతత్త్వజ్ఞుఁడు

సుమి—వానింగూడ దోడ్కొనిపొమ్ము కాకుండిన ఆయనకు మనస్సమాధాన ముండదు

చం—అవశ్య మట్లొనర్చెదను (అని యందఱును నిష్క్రమించుచున్నారు)

రంగము—చంద్రసేనునినగరు

[వర్ధమానుఁడు దోషాకరుఁడును ప్రవేశించుచున్నారు]

వ—నే నీనగరు విడిచిపోవకపూర్వమే చంద్రసేనున కర్హదండనము విధింపవలె

దో—కేవల ప్రభుభక్తిపరాయణుఁడనై పితృభక్తి యుజ్జగించినందుల కెంతయు లోకాపవాదపాలౌదు నను తలంపు మనసునకు వచ్చినపుడెల్ల నా కొడలు జల్లు మనుచున్నది

వ—నీ యన్నను నీతండ్రివధకుఁ బ్రేరేపించినది కేవలము వానిదౌష్ట్యమే కాదు నీ వాయవసరమునఁ బ్రకటించిన పితృభక్తి తనయుద్యమమును గాలహరణము గాకుండ నెరవేర్చుట యుచితమని నీయన్నకుఁ దోఁచునట్లు చేసెఁ గావలయు

దో—నాయదృష్టమేమోకాని నేను న్యాయపథ మవలంబించినందుకుఁ బశ్చాత్తాపపడవలసివచ్చుచున్నది ఆయన ప్రకటించిన లేఖ యిదిగో దీనిం బట్టినమాళవుఁడు మనరాష్ట్రమున పదముంచగల్గుట ఆయనతోడ్పాటువలననే జరిగినట్లు తెలియుచున్నది దైవమా! ఇట్టిరాజద్రోహ మింత జరగకుండనన, జరిగినచో నామంత్రపదము నీకుఁ గారణమునే గాకయుండినను నామనస్సున కిట్టిసంక్షోభము గల్గకుండును గదా

వ—నాతోడ రమ్ము మంపరం నీయోగ్యతను దెల్పెదను

దో—ఈలేఖయందలి వృత్తాంతము నిజమే మీకుఁ జేతినిండ పని సమకూడినది

వ—నిజమైనను గల్లయైనను చంద్రసేనుని సర్వమునకు నీవ కర్తవైతివి అతని జాడ గనిపెట్టుము వెంటనే భటులఁ బుచ్చి పట్టి తెప్పించెద

దో—(స్వాగతము) రాజు నావరించుమండఁగ నే పట్టి యిచ్చెదనేని వర్ధమానునకు నామాట లన్నియు గట్టిగా నచ్చగలవు వర్ధమానునియెడఁ బ్రభుభక్తినాటకము కొంతవరకు సాగింపవలసి యున్నది కాని యిందలి కృతఘ్నత నాహృదయమున కెంతయు వెక్కసముగానున్నది

వ—నీ వింతటినుండి నావిశ్వాసమున కెంతయుఁ బాత్రుఁడవైతివి నీతండ్రివాత్సల్యమునకుం బాసితివని చింతింపకుము దానికంటె నధికమగు నాప్రేమకుం బాత్రంబవైతివి

(అంతట నిష్క్రమించుచున్నారు)



రంగము— చంద్రసేనుని నగరసమీపమున నొక పశువులసాల

[చంద్రసేనుఁడు, మందపాలుఁడు, సుమిత్రుఁడు, విదూషకుఁడు, శ్వేతకీర్తియును ప్రవేశించుచున్నారు ]

చం—ఆబట్టయుకంటె నీశాల కొంత మెరుఁగుగదా ఇఁదుఁ బ్రవేశింపుఁడు నేనుబోయి నాకు లభ్యమైన కొన్ని యుపకరణములు గొనితడవు సేయక మీకుఁ జేరెదను

సుమి—అతనిమతి చాలభాగము చెడినది ఈయుపకారముల కీశ్వరుఁడు నిను దయుఁ జూచుఁగాత (చంద్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు )

శ్వే—నన్ను భేతాళుఁడు పిలుచుచున్నాఁడు

వి—రాజా! పిచ్చివాఁడు పెద్దమనుష్యుఁడా లేక చిన్నమనుష్యుఁడా?

మం—రాజు! రాజు

వి—నీకుఁ దెలియదు పిచ్చివాఁ డెవ రనఁగా చిన్నలకుఁ బెత్తన మిచ్చిన యా పేమనుజుఁడు కోమటివిశ్వాసమున, గోమలినిజమున, జారజుని పితృభక్తియుఁ గల్గకుఁ గల్గ

శ్వే—నన్నుఁ బిశాచ మావేశించుచున్నది

మం—న్యాయనిర్ణయము చేయవలసియున్నది (శ్వేతకీర్తితో) ఓ ధర్మనిర్ణయ కారిణీ! నీపీఠాసనము నధిష్ఠింపుము (విదూషకునకు) ఓవివేకనిధానమ! నీవీపీఠమున నిల్వుము ఏవీ యాజిత్తులమారినక్కలను బిలువనంపుఁడీ (సుమిత్రునితో) ఓప్రాడ్వివాకోత్తమా! నీ పీఠాసనము నలంకరింపుము మం ం దాచండిక నేరము విమర్శింపుఁగ ఈన్యాయసభ యెదుట నే ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచున్నాను ఈమె తండ్రి యగు రాజును బడఁదన్నినది

విదూ—ఓమానినీ! యిటురమ్ము నీ పేరు చండికయేనా?

మం—ఎట్లు కాదనఁగలదు?

విదూ—అయితే సరే చండాలి యనుకొన్నాను

మం—ఇదిగో యీమెను విచారింపుఁడు ఈమె కుటిలవీక్షణము లీపె హృదయగత మగు గాఢస్యమును బైలుఁ బెట్టుచున్నవి

సు—ఏమో యొరికిమిగల్గి యుండెదనంటివా యొరిశివయేడ?

శ్వేత—(స్వగతము) నాకన్నులఁ గ్రమ్మునీరు నానటనమును బైటపెట్టున ట్లున్నది

మం—ఈకుక్కలన్ని నాపై మొరుగుచున్నవి అల్లదె పులియఁడు బూచి గాఁడు వేపిగాఁడు

శ్వేత—ఇదిగో పాఱఁదోల మంటిని

తే. గీ. భైరవుండు కంటఁబడినంతమాత్రనే
పాఱకుండ నిల్చి బ్రదుకు టెట్లు
కుమ్మరకుక్క లోడిని గొంపోవుకుక్కలు
జాతికుక్కలా బలుజాగిలములు

మం—మందరహృదయమును శోధింపుఁడు ప్రకృతిలో నట్టిహృదయమునకు పాదానకారణములు గాఁ గలపదార్థ ముండునా?

సుమి—అయ్యా! విశ్రమింపుఁడు

మం—వద్దు చెయుకఁడు నిద్రించి రాత్రి లేచి చల్దిఁ గుడిచెదను

వి—నేను పగలు పాన్పుఁ జేరి పవ్వళించెదను

[చంద్రసేనుఁడు తిరిగి ప్రవేశించుచున్నాఁడు]

చం—మిత్రమా! ప్రభు వెక్కడ?

సు—ఇక్కడ నున్నాఁడుగాని యతనిమతిపోయినది అతనిఁ గదలించకుము

చం—నెచ్చెలీ! అతనియుసురుగొన నొకకుట్ర నడచుచున్నది యాదృచ్ఛికముగా నాచెవులం బడినది ఇఁక నిచ్చట మసలినయెడల నతనికిని నతని కుపకారమొనర్చు మనకును బ్రాణహాని యవశ్యము కావున నాతని నెత్తుకొని నావెంట వత్తువేని నీకుఁ గొంతబాసట యొసంగదు అటుపయిన నాతని మోచికొని కురుక్షేత్రము వైపునకుం బోవుదు రేని యచట మీకు స్వాగతమును సురక్షితయును జేకూరఁగలదు

సు—క్లేశపడి నీప్రాణములు విశ్రాంతికిం జొచ్చినవి ఈవిశ్రాంతి నీప్రకృతి క్షోభంబునకుం గొంత యుపశాంతి యొసంగవచ్చు కాని యదియు సాగ నవకాశము లేని యీపట్టున స్వాస్థ్యము దుష్కరము (విదూషకునితో) నీ వొంటరిగా నిచట నిలువం దగవు నీయజమానుని మోసికొనిపోవ సహాయముగమ్ము

చం—రండు పోదము (శ్వేతకీర్తి దక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు)

శ్వే—(స్వగతము)

మ. మనకు న్నీరిఁ వారి కాపదలు సంప్రాప్తంబు గాఁ జూచుచో
మనకష్టంబులు మాసిపోవు నొకనిం బాధించునట్టిల్ భువిం
బెరుగొండల్బలెఁ గానిపించు మఱి యాపేరల్ దగన్ లోకమం
దుఁ బెక్కండ్రకు నొక్కమా టొదవినం దూలక్రియం దోఁచెడిన్

"మహాగజాఃపలాయంతే మశకానాంతుకాగతిః" అన్నట్లు రాజంతవారలకు పుత్రికల కృతఘ్నతవలన మన్నుగఱచినపుడు నావంటివాని కక్రమముగా నయినను దండ్రి విధించిన దండనమున కింతవగలం బొగిలవలయునా? భైరవా నీవు దేశమంతయుం బ్రచ్ఛన్న వేషమునం గ్రుమ్మరుచు నీపై నకారణముగా వచ్చిన యపవాదము మాసి నీగురుయజమానులకుం బునర్విశ్వాసపాత్రుండవుగాఁ దగుతఱి వేచి నిజరూపంబున బయలు మెఱసెదవుగాత.



రంగము—చంద్రసేనుని నగరు

[వర్ధమానుఁడు, మంథర, చండిక, దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు]

వ—ఈయుత్తరము గైకొని శ్వేతధ్వజునిచెంతకు సత్వరంబునం జని సర్వము నతనికి నివేదింపుము మాళవులములు మనరాష్ట్రమునకుం దిగినవి అనుచరులారా! చంద్రసేనునింబట్టి తెండు (కొందఱనుచరు లందుకయి నిష్క్రమించుచున్నారు)

మం—తక్షణము వాని శిరచ్ఛేదము సేయింపుము

చం—గ్రుడ్లు తోడించుము

వ—అతని నాయాగ్రహమునకు విడువుఁడు దోషాకరా! నీతండ్రికి నేము విధింపవలసినదండనము నీకనలంబడఁ దగినది కాదు నీవు చండికతోడం జని శ్వేతధ్వజునితో యుద్ధసన్నద్ధుఁడవు గమ్మని విన్నవింపుము నేను జాగుసేయక యట్లయ్యెద చారులు జాగరూకులయి యనుక్షణంబును మాయుభయులకు నుత్తరప్రత్యుత్తరములఁ గొనిపోవుచుందురుగాక చండికా! పోయివత్తువుగాక సర్వంబును భద్రం బయ్యెడు. దోషాకరా! పోయిరమ్ము

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రాజువార్త యేమైనం దెలిసివచ్చితివా?

కు—చంద్రసేనుఁ డాతనిభటసాహాయ్యమున నాతనిగురుక్షేత్రపుమార్గంబునం బుచ్చెను అచ్చట వారినిమిత్త మొకరక్షకసైన్యము నిరీక్షించి యుండునఁట రాజు తోడం గొంత సామంతవర్గంబు కూడిచనియె

వ—మీరాణిగారికి కృత్యములనాయితంబు సేయఁబంపుము

చం—పోయివచ్చెదను

వ—శుభంబయ్యెడు పోయిరండు (చండిక, దోషాకరుఁడు, కుక్షింభరుండును నిష్క్రమించుచున్నారు)

భటులారా! మీరుపోయి ప్రభుద్రోహి యగు చంద్రసేనునిబట్టి కట్టితెచ్చి నా కట్టెదుటం బెట్టుఁడు (శేషించినపరిచరులు నిష్క్రమించుచున్నారు) విచారణలేకయే యతనికి మరణదండన విధింప నధికారసామగ్రి మనయందు లేకున్నను, మనయాగ్రహమున కెవఁడు ప్రతిఘటింపఁగలఁడు. ఎవ రీవచ్చువాఁడా ద్రోహి? (ముప్వుర భటుల వెంటఁ జంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మం—అదుగో వాఁడే కృతఘ్నుఁడు

వ—పెడకేలు గట్టుఁడీ యీదుర్మార్గుని

చం—ఏమి మీయూహ మీరు న్యాయవిధు లన్నమాట పాటింపక యిట్టియనుచితమునకుం గడంగి వలదు

వ—కట్టుఁడన్న నూరక దిక్కులేలఁ జూచెదరు? (భటులు కట్టుచున్నారు)

మం—ద్రోహిని, గట్టిగాఁ గట్టుఁడు

చం—ద్రోహమును గృతఘ్నతయు నీయం దున్నవిగాని నాయం దెంతమాత్రమును లేవు

వ—ఈకరమున వాని నంటఁగట్టుఁడు దుర్మతీ నీద్రోహము తెలిపెనదిదే

[మందర చంద్రసేనుని గడ్డము పీకుమన్నది]

చం—అయ్యో దైవమా! ఏమీ యీపరిభవము గడ్డము నుబట్టి లాగుచున్నారు

మం—గడ్డము పెరికినవిగాని ద్రోహము చావదేమ

చం—పాపకర్మురాలా నీవు పెఱుకువెండ్రుకలే నిన్ను శపించుచున్నవి గుడినుండి గుడిరాళ్లు దీయుకరణి అతిథియయి నాయిల్లు చేరి యిట్టియల్లరికి దొరకొంటిరే ఏమి సేయఁదలఁచుచున్నారు

వ—జోగాని మాళవునియొద్దనుండి నీకు వచ్చినయుత్తరముల తాత్పర్య మేమి?

మం—అది మా కిదివఱకే తెలిసినదిగాన నీవుకడపెట్టక కలరూ పెఱింగింపుము

వ—రహస్యప్రకారమున మనరాష్ట్రమునఁ బ్రవేశించియున్న మాళవసైన్యములతో నీకుఁ గలసంబంధమును దాఁచక చెప్పుము

మం—మతిచెడిన మీరాజును నీ వెవరిప్రేరణకయి యంపితి? పలకవేల? చెప్పుము

చం—నాకుఁ గొంతసూచనగా నొకయుత్తరము వచ్చినదిగాని యది తటస్థుల సమక్షమునుండి వచ్చినదిగాని ద్వేషులనుండి రాలేదు

వ—శుద్ధమోసము

మం—కేవలకల్పన

వ—నీవు రాజు నెక్కడి కంపితివి?

చం—కురుక్షేత్రమునకు

మం—ఎందులకయి కురుక్షేత్రమున కంపితివి ఆజ్ఞోల్లంఘనమునైఁ జిక్కికొనిన నీ ప్రాణములు దక్కవని చెప్పలేదా?

వ—ఎందులకై కురుక్షేత్రమునకు? ముం దీప్రశ్న కుత్తర మిమ్ము

చం—రోటిలోఁ దలయొగ్గి రోకటిపోటునకు వెరవనేల?

మం—ఎందులకై కురుక్షేత్రమునకు?

చం—నీక్రూరనఖములతని గ్రుడ్ల జీర కుండుటకును నీయక్కతనవాఁడికోరల నా మూర్ధాభిషిక్తుశిమాంసమున నాటకుండుటకునునై యట్లొనర్చితిని నిన్ను నావలిత శిరస్కునితలఁ బడినధారాపాతము సముద్రమును నింగికిం బొంగి చుక్కల మ్రింగునట్లు సేయఁజాలినను నతఁ డోరిమితో సైరించెను ఆట్టిమహాప్రళయమునఁ దొల్లుడే వచ్చి నీ మోసలరోదనము సేసినను నీహృదయము కఱఁగి తలఁపు దీయింతువే మీకృతఘ్నత కప్రాయశ్చిత్తము మీఁద సంభవింపకపోదు కన్నులారఁ జూచెదంగాక

వ—అనే పాతకి కన్నులారఁ జూతువట రా? శిరమును గట్టిగాఁ బట్టుకొనుఁడు వీనికన్నుల నాకాల గ్రుడ్డిసేను (ఒకకంటిం గాలఁద్రొక్కుచున్నాఁడు)

చం—తలనెరయుదాఁక జీవింపఁదలఁచువాఁ డెవ్వండేని నాకుందోడయ్యెడుఁగాత దేవతలారా కావుఁడు ఏల నాపై నిర్దయ చెపె యుపేక్షించెదరు

మం—రెండవకన్ను వెక్కిరించుచున్నది దానింగూడ పెకలింపుము

వ—మమ్ము శపింప సమకట్టితివా దురాత్మా!

మొదటిభటుఁడు—ప్రభువా! తాళుము నేఁ జిన్ననాఁటనుండియు నీకొలువుసంజేసినవాఁడ నేఁడు నిన్నాఁగుమని నిరోధించుటకంటె నీకు హితకరమైనసేవ యెన్నఁడును జేసియుండలేదు

మం—ఛీ! పశువా!

మొదటిభటుఁడు—మగవాఁడవైతివేని దాడిబట్టి ఝాడింతును

వ—ఛీ దుర్మార్గుఁడా! (ఇద్దఱును గత్తులు దూసి పోరుకుఁ జొచ్చుచున్నారు)

మొదటిభటుఁడు—నాకోపాగ్నికి శలభంబ వగుము

మం—ఛీ దుష్టకొనువాఁ డిట్లు తిరుగబాటుసేయునా! నీకిద్దమిటు లిమ్ము (కత్తి నంది వెనకనుండి వ్రేయుచున్నది)

మొదటిభటుఁడు—నాప్రాణములు పోవుచున్నవి గాని మహాప్రభూ! ఆమిగిలిన కంటితో నీతుచ్ఛుని యొంటిపై యీగంటుఁ జూచి సంతసింపుము (అని నేలఁ బడుచున్నాఁడు)

వ—ఇఁకనుం జూతువా? (రెండవకన్ను గ్రుమ్ముచున్నాఁడు) నీకళి యిప్పు డెటఁ బోయె?

చం—అకటకటా! నాకుం బ్రపంచ మస్తమించినది దోషాకరా! నీకరమునఁ బ్రాణముండ నాకీచెటు వాటిల్లినది నీపౌరుషముఁ జూపి దీనికిఁ దగిన నిష్కృతి యొనస్తువు గాక

మం—ఛీ ద్రోహీ! దుష్టవర్తనా! నీపాడఁగాన నసహ్యపశువానికై యేల యిట్లు వాచెఱచెదవు నీద్రోహమునకు వెక్కసపడి యాతఁడ దాని మాకు వెల్లడి చేసినవాఁడు

చం—ఆహా! ఎంత యవివేకినై స్వేతకీర్తికి ద్రోహము చేసితిని దైవములారా! నన్ను క్షమించి నానిని రక్షింపుఁడు

మం—వీనిం గొంపోయి వీధిలోఁ బారవైచుఁడు కురుక్షేత్రమునకు మార్గమును దడవుకొనుచుం బోయెదుఁగాక (ఒకభటుఁడు నిష్క్రమించును) హా ప్రాణనాయకా! నీ విట్లు గ్రుడ్లు తేలవైచెద వేల?

వ—నాకు గాయము తగిలినది ఆగ్రుడ్డిని వెడలనడచి, యీతుచ్ఛునిఁ బెంటపాలు సేయించి నీవు నాతో రమ్ము ప్రాణేశ్వరీ! గంటునుండి రక్త మెట్లు దొరగెడినో కంటివే? అకాలమున నీగాయము తగిలినది సాక్కు పుత్రైము కేలూత యొసంగుము (మందర కేలూతఁగొని వర్ధమానుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

రెండవభటుఁడు—నాకేగతి ప్రాప్తమైనను సరేకాని యాదుర్మార్గునిమాత్ర మాయువు నిండవలెను

మూఁడవభటుఁడు—ఆ పెవార్ధికమువరకు బ్రదికి సద్యమరణము నందుచేని ప్రపంచమున నాడువాం డ్రందఱును బ్రహ్మరాక్షసు లగుదురు.

రెండవభటుఁడు—మనమావృద్ధప్రభువును జేరి యతఁడు తనయిచ్ఛవచ్చిన తావు చేరుటకునై యే బిచ్చగానినైనఁ దోడు చూపుదము. పాప మాయంధుఁ డింక నిటు మసలు నేని యీదుర్మార్గున కేమేమి తోఁచునో?

మూఁడవభటుఁడు—నేను నాస్రవించు కనులకుఁ గట్టుటకుఁ గాను, కొంచెము దూదియుఁ గోడ్డెగుడ్డుసానయుఁ దెచ్చెదను. దైవము రక్షించుఁగాత.

(అందఱు నిష్క్రమించుచున్నారు)



శ్రీ

# మందపాల చరిత్రము.

## చతుర్థాంకము

రాగము — ఎమాల

[శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

శ్వే—చ ధరణిఁ బ్రసిద్ధిగానిటుల త్యాజ్యుఁడనై చరియించుటాత్మలో
గరిమన హేయతంబడి ముఖస్తుతులందుట కంటె మేలగున్
బరగఋణంబుసేసి కనవైభవమయ్యది వైభవంబె చూ
పరభ్రమియింపఁజేయునగు వాపునుబల్పగు నేతలంపఁగన్

చ పరమదరిద్రుఁడభ్యుదయ పాత్రతఁగాంచెడుఁ గానిహీన తం
బొరయుఁడు గానవానికిఁ బ్రమోద మెగ్లైడు లేదు ఖేద మీ
ధరపయిఁగోటీశ్వరులు దైన్యము నీశకు మించులోతు నెం
దరసినఁగల్గునే తెలియుకష్టము గానదు కాక యెయ్యెడం
సిరిగలవానికింగలుగు చింతయు భీతియు జోగి కుండునే?

కావున నాకుధైర్యమే కాని భయంబులేదు ఎవరావచ్చెడివారు

[ఒకముసలివానిచెయిపట్టికొని చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కటకటా! ఈదైన్యమున నేలీరవాఁడ మాతండ్రి ప్రపంచమా! చక్రనేమిక్రమము ప్రాణులకెల్లుచ్చావచస్థితులు గల్గకుండినచోఁ బ్రాణములుకాలముతీరినను బొందిఁబాయనొల్లకుండుఁగదా? ముసలివాఁడు మహాప్రభూ! నేనెనుబదివత్సరములనుండి నీతండ్రికి నీకును బాలికాఁపునై యుంటిని

చం—సువ్రాదుఁడా! నవుఁబాసిచనుము నీయుపచారములం నాకుశాంతినోసంగ నేరవు నీకుహానిగావింపనోపు

ముసలివాఁడు అయ్యో! కానఁగన్నులు లేవు. కన్నెట్లు విడుతు

చం—కన్నులున్నపుడు మూసికొని తప్పుదారిఁబట్టియుంటిని. ఇట్టివానకుఁ గన్నులుండిన్నేల? అకటా! కలిమివఁ గన్నుగానక కడకు వేల్పులొనిన నేమిప్రయోజనము?

చ. ఎనసుదయావివేకములు హీనతనొందినవానిబొందు సం
పదలు ప్రభూతమోహ మదవర్ధనహేతువులై కలంచు నా
పదలిలనంకుశంబులయి బల్మిఁ దదీయమదేభతుల్య దు
ర్మదయుతమానసంబును దెమల్చి తిరంబుగ నిగ్రహించుఁ గా

ఓ ప్రియతనయా! స్వేతకీర్తి నిన్నెగ్గాడి త్రోచిపుచ్చితి హా! పుత్రా! కంఠమున ప్రాణముండ నీగాత్రపరిష్వంగ సుఖంబు గనఁగల్గుదునేని నాకుంగన్నులు గల్గినట్లానందించువాఁడ

ముసలి—ఎవరచ్చట?

స్వే—(స్వగతముగ) హా! దైవమా! మనుజుఁడెన్నటికిని సంసారసాగరము నగాధముగఁదలచి బ్రతికితినని కొనఁగూడదు. ఇదివఱలోని కష్టములకంటె కష్టతరావస్థ సంప్రాప్తమైనది

ముసలి—ఇతఁడు పిచ్చిపాతల భైరవుఁడు

స్వే—(స్వగతము) నేనింతకంటె దుర్గతి పాలుగావచ్చును భవిష్యత్తునందు నంతవఱకు "నాదురవస్థకిది పరమావధియని" నరుఁడెప్పుడును భ్రమయఁజనదు

చం—ఇతఁడు కేవలము పిచ్చివాఁడైయుండఁడు అట్లైన, వీఁడు ఓచ్చమునకేలఁ దిరుగును? నిన్నటిరేయి నేనిట్టివానినొకనిఁగంటి వాఁడు మనుష్యుఁడనంగ కృమిప్రాయుఁడని తోఁచునట్లు చేసినాఁడు నాపుత్త్రుఁడప్పుడు దృష్టికి వచ్చినాఁడుగాని వానియందప్పటికి యనురాగము కుదిరియుండలేదు లోగడ సమాచారమువలన సర్వమును దేటపడినది

దేవతలకు మనమెంతవారము పిల్లలీగలను జేసినట్లు వారు క్రీడార్థము మనలను బాములు పెట్టుదురు

స్వే—(స్వగత) కట! కటా! ఇట్టి దురవస్థలోనున్న వానికిఁ గపటవినోదములు గల్పింపసమకట్టుట కఠినవానిపని (ప్రకాశముగా) జయజయ మహాప్రభూ!

చం—వీఁడే నా దిగంబరుఁడు

ము—ఔను మహాప్రభూ!

చం—అయితే నీవు ప్రస్తుతము పోయి, నీహృదయమున పూర్వవిశ్వాసము వసలు —

చూడనేని మే యికురుక్షేత్రమార్గమున రెండుమూడుమైళ్లు సాగునప్పటికి దీననియాచ్ఛా
దనార్థమొక యంగీగైకొనివచ్చి యొసంగుము పీనింబ్రతిమాలి దానిదీయించుచుందును

ముసలి—అయ్యో! వీఁడుపిచ్చివాఁడె

చం—పిచ్చివాఁడు గ్రుడ్డివాండ్రకుఁ ద్రోవచూపు కాలమువచ్చినది నీవేమిచె
యఁగలవు? నీకిష్టముండినచో నాకొక చెరవేస్పుము ఏదెటులైనను నీవునన్నుమాత్ర
మవశ్యము విడిచనుము

ముసలి—నాకేమి కీడుమూఁడినను సరే నాయొద్దనున్న ప్రశస్తమైన యంగీదెచ్చి
యిచ్చెదను

(నిష్క్రమించుచున్నాడు)

చం—ఓరీ దిగంబరా!

స్వే—(స్వగతము) నాకుఁగాలుచేతులాడకున్నవి ఇఁక నటించుట దుష్కరము

చం—ఇటురమ్ము

స్వే—(స్వగతము) తప్పకవచ్చినం జేయునదేమి! అయ్యో నీకండ్లెట్లురక్తము
గారుచున్నవే!

చం—కురుక్షేత్రమార్గము దెలియుదే

స్వే—అదినాకుఁగొట్టినపిండి, సందుగొందులు దిడ్డిదార్లు, కాలిత్రోవలు, రాజ
మార్గములు వేనెఱుంగనివిలేవు ఈ భైరవునైను పెనభూతము బాధించుచు మతిచెడి
చినది నిన్నీశ్వరుఁడు రక్షించుఁగాత

చం—ఈధనకోశము నందికొనుము దైన్యమున నీకుఁ దోడుగనున్నాఁడన నన్నుఁ
జూచిననీఖేదము కొంతయుడుగుఁగాత సంపన్నాంఘులకు దారిద్ర్యమంజనము కష్టములు
వచ్చినప్పుడుగదా వారితరులకష్టములు భావమునఁదెలియనేర్చి, నిరర్థకములగు తమయ
ర్థముల దీనార్తిపరిహారార్థమై పంచియివ్వఁగలుగుదురు అప్పుడుగదా ప్రపంచము నన
ర్థములు సార్థకములగును కురుక్షేత్రమునకు దారి యెఱుంగుదువా?

స్వే—అయ్యా! ఎఱుంగుదును

చం—అట్లయిన నన్నందోడ్కొని యరుగుము

చ. అరుదుగఁ గంకటాలమున సంబరమించు బిశిరోగ్రభాగ వి
స్ఫురితబరాహకచ్ఛరి సముజ్జ్వల గండశిలావిశీలమా
గిరివర మొండుగాంచెదవు క్రేవన గాఢజలప్రవంతి పై
కొరిగిభ కూవహాంబగుచు నొప్పెశ్మదానినమున్నతాయుతిన్

స్నానాగారంబునకుం గొంపోయి నిల్పుదువేని యీమార్గము నేఁజూచికొని యెద నీవునుండఁగ పారితోషకమునంది యథేచ్ఛం జనియెదుగాక

స్వే—సరే నీకేలిటులిమ్ము మార్గముదీసెద

(నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—శ్వేతధ్వజునినగరువాకిట

[చంద్రికయు, దోషాకరుఁడును ప్రవేశించుచున్నారు]

చం—దోషాకర! ఇదె మాభవనముం జేరితివి స్వాగతము అదృష్టవశమున దురహంకారియగు నా భర్తమార్గమధ్యమున మనకుఁదారసించఁడాయె

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మీప్రభువేడ?

కు—లోపలనున్నాఁడుగాని యతనిముఖమెంతయు వికాసమువీడియున్నది

ఉ॥ శత్రులవచ్చిచేరిరన సన్నిహితుండై గనపట్టనీవు నీ
రాత్రికివత్తువన్నను గరంబున మోదమ్మునొంబ దుష్ట చా
రిత్రుఁడు చంద్రసేనుఁడెదిరింగడు వంచనసేసిచేరఁ ద
త్పుత్రుఁడు ద్రోహమున్వెడలఁ బుచ్చెనటన్నను గెలిసేదన్

అతనికేమియొకాని యప్రియంబు ప్రియంబుగను ప్రియంబప్రియంబుగను గానిపిం చెను

చం—(దోషాకరునితో) నీవిచ్చటనుండిమరలుము అటఁనిజమున నీవొత్తదనము వలననే యతఁడేయువార సాహసములకును జొరనేరఁడు క్షత్రధర్మమును విడనాడి తన్నారులుపరిభవించినను విక్రమమునకుం గడఁగఁడు నీవువర్ధమానని పాలికంబోయి, సేనలకూర్చి, సేనాముఖంబునరిమ్ము నేలోనికిఁబోయి యీగాజులు నాభర్తచేతులనిడి రణకంకణముగట్టెదను విశ్వాసపాత్రుండగు నీకుఁకుక్షింభరుం డప్పటప్పటి మాకురాయభారము నెరపుచుండెడిని నీవు సాహసమునకుం దిగనోపుదువేని మనమార్గమున నిశ్చయించుకొనినతలంపులీడేరియు చిరకాలములో నాహృదయము నీవశమొనరించుకొందువు గాక

(ఉంగరమతనివ్రేల నిడుచున్నది)

దో—నాశక్తియుక్తులెల్ల వినియోగించి యత్నించెదను

చం—శుభంబగుఁగాత (దోషాకరుడు నిష్క్రమించుచున్నాఁడు)

క॥ పురుషులు పురుషులనంగను
ధరఁగలవారెల్ల తథ్యతంబురుషులె యీ
తరుణీరమణుఁడు దోషా
కరుఁడొకఁడొ గాక దర్పకప్రతిముఁడిలన్

కు—అమ్మా! ప్రభువుగారు విచ్చేయుచున్నారు (నిష్క్రమింపుచున్నాడు)

[శ్వేతధ్వజుఁడు ప్రవేశించుచున్నాడు]

చిం—కోటిమాటలకైనం దగనిదాననైతినా? ఇంతపాడితప్పనేల?

శ్వే—నీవు నీమొగమున రాలురజోరేణువు పాటసేయవు నీవిపరీతస్వభావము దలంచిన నామేను గరుపారెడు

కం॥ జనకునివిడనాడిన యా
ఘనపాతకి ప్రమానసుంశిఖండించిన కో
మ్మనుబోలి మ్లానమై చెడు
జనకద్రోహులను మట్టి శ్వానము వెఱచున్

చిం—ఈనీతులు నాకుం జవికావు చాలింపుము

శ్వే—ఆ॥ వె॥ జ్ఞానమజ్ఞుడెదకు గంటకమై తోఁచు
రోగిపథ్యమన్న రోతపడును
పందిబురద మెచ్చుఁ బన్నీరు మెచ్చదు
ప్రకృతిఁబాయలేరె పాపమతులు

మీరనయమ్మెట్లు ప్రియంబగు? మీరు ఘాతుకమృగములు గాని మనుష్యప్రాయు లరా? జనకుఁడు శతవృద్ధు ఆతని పలితోత్తమాంగమును జూచినబుద్ధియైన జాలిదలఁచు అట్టివానిమీరు కృతఘ్నులై ద్రోహముచేసి మతిపోయఁజేసితి రిట్టికృత్యంబులుగలవే మీరు చెప్పినను జేసితిరి గాక ఉత్తమక్షత్రియ వంశజుఁడు తదనుగ్రహదత్తరాజ్యప్రవర్ధమానవిభవుండగు వర్ధమానుండెట్లు మీపనికియ్యకొనియె అకటా! ఈ యుత్కట కృత్యంబుల దైవంబుపేక్షించునే? కాని మనుజులు మనుజులన్నైన నిచ్చెదిని యాదోరాశిం ద్రోచియొన ర్చుకుందురే

చం—౨ తడబడి రాచబిడ్డనిగ ధాతనిను న్ప్రజయింపఁబోలు నీ
ఒడుపున దైన్యమున్ భవయు క్షత్రకులంబునఁ గల్గనేర్చునే
పుడమిచలింపమాళవపు మూహత్తిపీనల సోకుచుండినం
బడయువుపౌరుషంబు జడభంగినిజేసె దుస్వార్థచింతనల్

స్వే—కం చండకృశానునిపోలిక
మండెడు కన్నులనుహృదయమర్మోద్భేదో
ద్దండములౌపల్కుల నో
చండ! రక్కసులునీకు సరిరారవనిన్

చం—ఛీ! చేతఁగానివాఁడా!

స్వే—ఛీ! పిశాచీ! ఏలఁదుమ్మలలో ప్రొద్దుగ్రుంకినట్లు మొగము గర్వోగ్రబాములు ముడివడఁజేసెదవు ఎంతపిశాచివైనను స్త్రీవైతివిగాన సైరింపవలసె కానిచో నీకండములెరికి భూతములకు భక్ష్యములుపెట్టి నాకోపాగ్ని చల్లార్చుకొందుఁగదా!

చం—ఏమిపౌరుషములు వల్కుచుంటివి?

[చారుఁడు ప్రవేశించుచున్నాడు]

స్వే—ఏమిసమాచారము?

చా—అయ్యా! వర్ధమానుఁడుసమసె చంద్రసేనని రెండవకన్న గ్రమ్మగము కింమనాతనిపై రోషముపట్టఁజాలక యొకభటుఁడు వానింజరిమార్చె

స్వే—చ పటుగతినిట్టులీవధిక పాపులకర్హములైనదండనల్
దటుకునఁబంపకున్న యెడ దైవము! దుర్ణయమెట్లుమాయు ను
త్కటమగుపుణ్యపాపములఁ గల్గుఫలంబిటనేలభింప సం
ఘటనమొనర్చునీమహిమ కాదెజగత్స్థితి హేతువారయన్

చా—అమ్మా! వెంటనే ప్రత్యుత్తరమన గోరినీచెలియనీయుత్తరమంపినది

చం—ఒకవిధమున నా కీవార్త శుభశంసిగానె యున్నది అధికారగౌరవము నాపై మ్రొగ్గెడును కాని నాచెలియలు పతివిరహిత యగుటయు నాప్రియుఁడగుదో షాకరుఁడచట నున్కియు నామానసం బలయించుచున్నది నామనోరథములు స్వప్న సంపద లగునేమో యనుశంక నాకు హృదయశల్యముగా నున్నది ఇంచుక విచారించి ప్రత్యుత్తర మొసంగెదఁగాక [*ప్ర్కి*యించుచున్నది]

స్వే—చంద్రసేనునికన్నుల గ్రుమ్మనప్పుడు కొడుకెచట నుండెను?

చా—మీరాణితో నిచ్చటకే వచ్చినాఁడు

స్వే—ఇచట గన్పడలేదె

చం—లేదు మహాప్రభూ! తిరిగి నాకెదురుపడినాడు

శ్వే—ఈదుర్ణయము వాఁడెఱుఁగునా?

చా—ఆమహాప్రభూ! వాఁడె వర్ధమానునికిఁ దండ్రిపై కొండెములు సెప్పిన వాఁడు వర్ధమానుఁడు దారాళముగాఁ బగ దీర్చుకొనుటకుగాను తానుమొగము దప్పించినాఁడు

స్వే—చంద్రసేనా! నే జీవించియుండ రాజానకు నీ వొనర్చినమేలు మరవను మిత్రా! ఇటురమ్ము ఇంకను గలవిశేషములు దెలుపుదువుగాక (నిష్క్రమించుచున్నారు)



రంగము—కురుక్షేత్రమున మాళవశిబిరము

[సుమిత్రుఁడను నొకపెద్దమనుష్యుఁడును ప్రవేశించుచున్నారు]

సు—మాళవేశుఁ డంత యాకస్మికముగ మరలిచనినదాని కారణమెఱుంగుదువా?

పెద్ద—తాను బయలుదేరునప్పుడే తనరాజ్యకార్యములో నొకముఖ్యమైనదానివిషయముగొంత యుపేక్షచేసి వచ్చెను. అది యిప్పుడు దోపద్రవకారియై యవశ్యసంస్కరణీయముగాఁ దోఁచినందున నాయన యీక్షణము పోవలసివచ్చినది

సు—అట్లైనవారికి సేనల కిక్కడ నాథుఁ డెవ్వఁడు?

పె—ఆయన సేనాని యగువిక్రమసింహుని సేనాముఖంబున నిల్పి చనియె

సు—నీయుత్తరములఁ జదువుకొనునెడ సుశీలమొగమున ఖేదచిహ్నము లగపడినవా?

అయ్యో నాయెదుటనె చదువుకొన్నది అప్పటప్పట స్థూలముక్తాఫలోపమంబులగుబాష్పబిందువు లామె చెక్కుటద్దములపై జారుచుండినవిగాని యాధీరస్వాంతతనవంతయంతయు దిగఁద్రావి గాంభీర్యము విడువదాయెను

సు—ఇట్లయిన నావృత్తాంత మామెమనసును గొంత గలఁచినది

పె—కాని బేలతనముగాని దురహంకారముగాని పొడమకుండినవి

చ క్షమయును ఖేదము న్హృదయసారసమందు జెనంగుచుఁడ నా
రమణిముఖాంబుజంబునను రమ్యవినూతనశోభ దోఁచె నా
సమయ మదండవాన లొకచక్కి గనంబడు నాదినంబు చం
దమున మనోహరంబయి ముదం బొదవించెను జూచువారికిన్

చ అరవిరిదమ్మిరేకులహిమాంబుకణంబులు గప్పమాడ్కి నా
తరుణివిలోచనంబు లసితద్యుతిఁ బొల్చెను బాష్పబిందువుల్

దరహాసితంబు తద్వదన తామరసంబునఁ దోఁచె మేఘమం
దరతరణిద్యుతిం దెగడి దంతమరీచులు కొంతబర్వఁగన్
గీ. మంజుతన్మూర్తి గౌరవమార్దవములఁ
క్రొంజవ్వనించి యొప్పులు గుల్క చెలరి
ఖేచరసమును హృదయప్రమోద మొసఁగె
మధురమూర్తులకఖిలంబు మండనంబు

సు—ఆమె నిన్నేమియుఁ బ్రశ్న లడుగలేదా?

పె—ఒకటిరెండుసార్లు ససౌహార్దంబుగా నిన్నునం దనతండ్రిని దలఁచినది తన తోఁబుట్టువుల స్మరించి స్త్రీజాతి కెల్లఁ దలవంపు వాటిలఁ జేసితిరిగదా! రాత్రి బైట పెనుగాలివానలో నావృద్ధు నట్లు చెసితిరే జగతిని విశ్వాసము నను విశ్వసింపవచ్చునే? జాలి యెక్కడను నున్నదే? అనియామె చెక్కులఁ గన్నీరు గొనగొర జమ్ముచు దుఃఖోపశాంతి సేయంగోరి యేకాంతనికేతనంబునకుం జనియె

సు—ఆహా! మనప్రకృతులు పూర్వకర్మాయత్తంబులు గాకున్న నేకదంపతీజాతులగువీరల కింత నిసర్గసిద్ధ మగుభేద ముండునే? తర్వాత నామెతో మాట్లాడితివా

పె—లేదు

సు—ఇదంతయు మాళవేశుని నిర్గమనమునకుఁ బూర్వమా?

పె—కాదు తన్నిర్గమనానంతరమె

సు—పాపము వృద్ధరాజగు మందపాలుఁ డిచటనే యున్నాఁడు మన విటకు వచ్చిన ప్రయోజన మతనికి మతి తెలిసి కల్గినపుడు గోచరించునుగాని యాతఁడు తనకు మార్తె మొగము చూడ నొల్లకున్నాఁడు

పె—ఏమికారణమున?

సు—నాఁడామెను శాపపూర్వకముగ కారణలేక పరదేశముపాలు సేసి యామె భాగమునుగూడ నారాక్షసస్వభావుల కిచ్చినందున కెంతయు లజ్జావనతుఁడయి యామెకనులం బడ శంకించుచున్నాఁడు

పె—అయ్యో! పాపము!

సు—వర్ధమానస్వేతధ్వజుల సేనలఁగూర్చి నీ కేమైనఁ దెలియునా?

పె—ఆసేనలు కదలినవని తెలియవచ్చినది

సు—అయ్యా నిన్ను మందపాలునిపద్ద కాఁపు పెట్టి నేను కొండొకప్రయోజనం

బునకై కొంతకాలము ప్రచ్ఛన్నముగా నుండవలసియున్నది అది తీరినవెనుక నీవు నన్ను దెలిసినపుడు నీ వీచేసినసాహాయ్యమునకుఁ జింతపడ నవసర ముండదు నా తోడరమ్ము

(నిష్క్రమించుచున్నారు (



రంగము—అక్కడనె యొక్కగుడారమున

[సుశీల, వైద్యుఁడు, భటులును దూర్యములతోఁ గేతనములతోఁ
బ్రవేశించుచున్నారు ]

సు—మ చలదుత్తుంగతరంగసంక్షుభితమై సంద్రంబువోలెం గడుం
జలధిత్తంబునఁ గంర మెత్తి ఘనగర్జాస్ఫూర్తి మ్రోయించుచున్
కలమక్షేత్రములందుఁ బెరుగు చెంగల్వల్లవాంకూరముల్
గిలగిచ్చల్ దెరిదుమ్మిపూలును సిగన్ గీలించి యాక్షేపణం
జెలరేగం బలు జాలిమాలి యతని న్నే నియ్యెడం గాంచితిన్

అకటా! ఇంతలో నేమాయె నూఱ్వురుభటులు పోయి నలుదిక్కులనుండు చేలఁ బోళ్లు బీళ్లు నరసి యాతనిం గొనితెండు (భటులతో నొకసేనాధిపతి నిష్క్రమించుచున్నాఁడు )

ఈతనిమతి కుదుటఁబెట్టం గలుగుపుణ్యుఁ డెవఁడేని చెకూరునెడ వానికి నిలువెత్తుధనము వోసెదను

వై—అమ్మా! ఆయనచిత్తచాంచల్యశాంతికి సుషుప్తియే పరమసాధనము ప్రశాంతచిత్తమున కీవిశ్రాంతి యొసంగఁజాలు నోషధు లనేకములు గలవు

సు—చ ఇలగలనోషధీచయము లిందుకుఁ జాలని నాఁడు నాదు —
కుక్కలదిగజారి జాలకొను కోష్ణజలంబుల నంకురించి యా
స్థలమునఁ బుట్టుఁగాతి నగదంకరణక్షమ నవ్యదివ్యసా
రలలితమూలికాతతి నిరామయుఁ డయ్యెడు మద్గురుండిలన్

వెదకి తెండు ఆలస్యము సేసిన మతిస్థిరత దక్కుటం జేసి ప్రాణాపాయంబయ్యెడు

[చారుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

చా—అమ్మా! శత్రుసేన యీమార్గముపట్టె యాపన్న మగుచున్నది

సు—అని యుదివరలోఁ దెలిసినవృత్తాంతమే మనసేనల్లు యుద్ధసన్నద్ధమై రిపుసేనం బ్రతీక్షించుచున్నయవి తండ్రీ! భవదర్థమై నేఁ డియ్యెడ దనుదెంచుచున్న దానను నీవా

ర్థకమందలి గౌరవమునననో నాయభ్యర్థములయెడల జాలిపడ్డనో నా ప్రాణేశ్వరుఁడు నామనవి మన్నించి మత్ప్రీత్యర్థ మీయుద్యమమున కియ్యకొనియె. నేపన్నుఁబనిచిన యీ సేనా వ్యూహమునకుం గారణము నీయెడ భక్తి ప్రేమా గౌరవములు గాని మదీయ ప్రాభవ ప్రకటన గాదు ప్రయోజనము నీకుఁ గల్గిన యవజ్ఞాపరిహారముగాని పరరాష్ట్రాక్రమణము గాదు, (నిష్క్రమించుచున్నారు)



రంగము—చంద్రసేనుని నగరు

[మంజరియు కుక్షింభరుఁడును ప్రవేశించుచున్నారు]

మం—శ్వేతధ్వజుని సేనాసన్నాహము పూర్తియైనదా ?

కు—చిత్తము అయినది

మం—ఆయన సేనాముఖమున నున్నాఁడా?

కు—ఎట్టకేలకు నతని నంచుల కాడంబరచితిని నీతోఁ ఎట్టు పంతకంబెలావుబంటు

మం—శ్వేతధ్వజునితో నతనియింట దోషాకరుఁ డేమియు సంభాషింపలేదా!

కు—అమ్మా లేదు

మం—దోషాకరునకు మాయుఁ గూఁ పంపినజాబు సందర్భమేమయి యుండును

కు—నాకవగతము గాదు

మం—చంద్రసేనునికన్నులు దీసినతర్వాత నాతనిసజీవునిగా విడుచు టొక గొప్ప యవివేకకృత్యము అతను బోయినత్రావుల నెల్ల జనులహృదయముల నతఁడు తనపక్షమున కాకర్షించుచుండును. అతనిప్రాణములతోడ నతనిదురవస్థకు విరామము గల్గించుటకును శత్రుసేనా వ్యూహమును బరీక్షించుటకును దోషాకరుఁడటఁబోయె

కు—అట్లయిన నీయుత్తరము గొని వాని వెతకికొనుచుఁ బోవలయును

మం—ఎట్లు మా సేనలు బయల దేరుచున్నవి మార్గములు సురక్షితములు గావు నీవుమాతో నిల్వరాదా?

కు—నిమిషమైనను నిల్వందగదు ఈలేఖను సత్వరము, నందింపవలయు నని మాయజమానురాలి దృఢశాసనము

మం—దోషాకరునకు నీవలన లేఖ నేలఁ బంపవలసె నోఁ మాటఁ బంపిన జాలక పోయెనా? ఇదియొకవిషయమై యుండవచ్చును నాకేమి నెయుటకుఁ దెలియ కున్నది ఓరి గాంబూట విని నన్నిట్టియుత్తరము విప్పనిమ్ము

కు—తల్లీ నాకంతకంటెనా—

మం—నీయాజకూనురాలిపాతివ్రత్యమున నా కెంతమాత్రమును విశ్వాసములేదు ఇది నాకు నిశ్చితాంశమే మొన్న నిచట నున్నపు డామె దోషాకరునివంక నవిశ్రాంతముగ జాడ్యల నిగుడించుట నాడనే పొడగంటిని ఆమె హృదయము నీ వెఱుంగనియదియా?

కు—నేనెఱ్ఱింగుదును

మం—నాయొద్ద మఱుగువెట్టెదవా! చాలు, చాలు! ఈలేఖఁజదికొనుము నేననాథను దోషాకరుండు మత్పాణిగ్రహోత్సాహముగలిగియుంటగూర్చి యిది వఱకే యతనితో మాట్లాడియుంటిని నీ పీలేఖనుగూడ నాతని కంపఁజేయుము నీయాజకూనురాలివద్ద నీ ప్రశంస వచ్చినపు డామెను వివేకము గల్గి బ్రతుకు మని నామాటగాఁ బలుకుము ఆ యంధుఁడు నీకనులం బడునేని యతనిం గడతేర్చి పారితోషకం బందుము

కు—అమ్మా! ఆదుర్మార్గుఁడు నాకనులంబడిన నీవు నావిశ్వాసఁ మెఱింగెదవు

మం—శుభం బగు (నిష్క్రమించుచున్నారు)

రంగము—కురుక్షేత్రము చెంతకేదారములు

[చంద్రసేనుఁడును, కృషీవల వేషధారియగు శ్వేతకీర్తియుఁ బ్రవేశించుచున్నారు]

చం—ఆకొండకొనపై నెప్పుడు చేరెదము?

శ్వే—ఇదుగో యెక్కుచుంటిమి ఎక్కునప్పటి యత్నము నీ కవగత మగుచుండలేదా?

చం—ఏమో నా కీభూమి చదునుగాఁ దోఁచుచున్నది

శ్వే—ఆహా! ఈకొండ యెత్తున్నత్యము! అడుగున గంగాస్రోతోవేగమైన నీచెవులకు గోచరించుటలేదా?

చం—ఏమియు గోచరించుట లేదు

శ్వే—అట్లేని నీకన్నులతోఁగూడ నీ యితరేంద్రియములుఁగూడ జడతనొందినవి

చం—అయితే కావచ్చును నీకంఠస్వరము మారినట్లు దోచుచున్నది నీభాషణములందు మునుపటికంటె శబ్దార్థగౌరవము లధికముగఁ గన్పట్టెడును

శ్వే—అదియెల్ల భ్రాంతియే ఒక వట్టిలవిషయమునందక్క తక్కుగలయంశములలో నాకుఁ గన్గినమార్పేమియు లేదు

చం—నీవాక్య వైఖరి మారినట్లు తోఁచెడును

స్వే—చ. గిరిశిఖరంబుఁ జేరితిమి క్రిందఁ గనుంగొనఁ గండ్లు గిఱ్ఱునం
దిరిగెడు నంతరాళమున నిమ్మిఁ జరించెడు గృధ్రవాయ సో
త్కరమతి సూక్ష్మరూపమునఁ గన్పడుఁ బిచ్చుకగుంపువోలె నా
దరిగిరిపార్శ్వమందునను ధాతుశిలాచితికై యొకండు చూ
పరకు భయంబుగొల్పు మను ష్ట్రోకయింతయు లేక నిల్చెడుం
పరిసరవాహినీతటిని బ్రాకెడు మూషకపంక్తివోలె జా
లరులు చరింతు రల్లదె జలంబులఁ దేలెడు నోడ చిన్నక
ప్పెరవలెఁ గానపించెడును భీతిఁ జలించెడు మేనునిల్చినన్

చం—నీ వున్న తావున నన్ను నిల్పుము

స్వే—నీ చెయి టులిమ్ము ఇప్పుడు కొనయంచున కడుగుదూరమున నుంటివి నా యెత్తు ధనము వోసినను నేనిట్టి సాహసమున కియ్యకొనను

చం—ఇఁక నా చేయివిడిచి యమూల్య రత్నగర్భితమైన యీ ధనకోశమును గైకొనిపొమ్ము నిన్ను సహాయమునకై దైవము మెచ్చుఁగాత! నీపోక నాకు వినఁబడునట్లు పొమ్ము

స్వే—దయయుంచుము పోయివచ్చెద

చం—నీయెడ నాకు హృదయపూర్వకమగు వాత్సల్యము గలదు

స్వే—(స్వగతము) ఈ వంచనచే నీతని దుశ్చింత మాయుఁగాత

చం—(కేలుమోడ్చి)

ఉ. చింతల నెంతయుం జివికి జేడ్పడియైహికభోగమన్న న
త్యంతవిరక్తిగల్గి నిరతంబు భవచ్చరణాబ్జయుక్తమై
నెంతయు ధన్యతంబడయ నిచ్చ జనించిన మేనువాయ నుం
కింతుఁ గృపన్ననుం బహుళకిల్బిషమగ్నుని బ్రోవుమీశ్వరా!

గీ. తనువు క్రిందఁబడినదాఁక తాళుదు నేని
పూర్వకర్మమెల్లఁ బొలియుఁగాని
బొందిదొరిగి నిన్ను బొందఁగోరిక గల్గె
నిలువనోపనింక నిముసమైన

దైవమా! స్వేతకీర్తి సప్రాణుఁడై యున్నచో వాని నాయురారోగ్యైశ్వర్య యుతుం జేయుము ఓగీ నీవిఁక తొలఁగి చనుము (ముందుకుఁబడుచున్నాడు)

స్వే—అయ్యో! పడితివా (స్వగతముగా) తానను కొన్న తావుననే యుండినచో నీతఁ డీవరకు నాకవశిష్టుఁడై యుండును ఇప్పుడైనను నాకుపవ్వు గనంజనదు దృఢమైన ప్రాణత్యాగనిశ్చయ మొకానొకప్పుడు ప్రాణహాని యొనర్పఁజాలదు (ప్రకాశముగా) అయ్యో యెంతపని జరిగినది నాయనా పల్కుము నా మాట వినఁబడుచున్నదా? ఇంకెక్కడి వినఁబడుట? ఆహా! ఏమి యీ ఆశ్చర్యము ఇంకను సప్రాణుఁడవై యుంటివే?

చం—నన్ను విడువుము నాకీ బ్రదుకన్న భారముగా నున్నది

స్వే—ఉ॥ తూలమువోలె నీవిటులఁ దుంగనగాగ్రము నుండి నేలపైఁ
గూలియు నొవ్వకున్కి గనుఁగొన్నను విస్మయమయ్యెడుం గడుం
గాలము చెల్లకుండిన జగంబునఁ బ్రాణులు చిచ్చుఁజొచ్చినన్
నేల నడంగియుండినను నీటమునింగినఁ జావ నేర్తురే

చం—నేను పడితినా? లేదా?

స్వే—సామాన్యపుఁ బాటుపడితివా? ఆకొండకొనఁ జూడుము మేఘమండలము నొరయుచున్నదే?

చం—అయ్యో నాకుఁ జూడంగను లెక్కడిది? అకటా! దుఃఖవిముక్తిఁ బొందుటకునై మరణమైనను నాస్వాధీనము గాదాయెగా ఇంతవరకు దీనులద్ధతుల యాగ్రహమునకుం దొలఁగుట కీపాటి స్వాధీనమగు సాధనమొకటి యున్నదను నమ్మకమునం గొంత యూరట గాంచితి అదియును నేటితోఁ దీరె ఇఁక నాకెద్ది తెరవు ఎందుఁ జొత్తు

స్వే—నా కేలూతగొని లెమ్ము లేవఁ గల్గితివా?
చం—అకటా! అనాయాసముగా లేచి నిల్చితిని
స్వే—ఇంకొక యద్భుతము ఆ పర్వతాగ్రమున నిన్ను విడిచి పోయినదేమి?
చం—పాపమొక నిరుపేద బిచ్చగాడు

స్వే—ఈ క్రింద నిల్చిన నా కదియొక వికృతాకారమగు భూతముగాఁ గన్పట్టినది కనుఁగవ తీక్ష్ణమై దీప్తార్కద్వయము ననుకరించియుండె సహస్ర జిహ్వాలు ననేక నాలుకలు కుటిలములై కొనలు దేరు కొమ్ములును జూపరకెంతయు భయంబు గొల్పుచుండె నాయనా! అఘటనాఘటన సమర్థుఁడగు దైవము కరుణ గల్గి జీవించితివి నీవింక నొండు తలంపులు దక్కి నాతోడ రమ్ము

చం—ఔరౌను! నాకిప్పుడు దెలియుచున్నది నే మనుష్యుఁడని భ్రమిసితి గాని నన్నుజే పట్టిన యీ భూతము మాటిమాటికిఁ బిశాచముల సంగతే వాకొనుచుం డెను ఇఁక నా దుశ్చింతలు దొలఁగి దైవానుగ్రహము నిరీక్షించెదఁ గాక

స్వే—అవశ్య మటులొనర్పుము ఈ వచ్చువారెవరు? (అడవి పువ్వుల వికారముగా శరీరమం దెడనెడ ధరించి మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చూడ మతిలేనివాఁడుగాఁ గన్పట్టుచున్నాడు ఉన్నచో నిట్టి వికారముండునా?

మం—నే రాజును నా శాసనముల ముద్రించినందుకు నన్ననఁగల వారెవరు?

స్వే—అయ్యో! నిన్నుజూడ గుండె నీరగుచున్నది

మం—ఆ యేబ్రాసి, పంట కాపువలె విల్లెక్కెక్కిడు చున్నాడో కంటివా? ఓరి యేబ్రాసీ ఆ శ్రవణాంతము చేయుము ఏమిరా యీచుంచు నిర్భయముగాఁ దిరుగుచున్నది సొమ్ము గావలసియుంటే నీలెక్క తీసుకొనిరా యిచ్చి వేసెదను

చం—ఆకంఠస్వరము నాకుఁ బరిచితమైనదే ఆయన మందపాల మహా రాజు గాడా?

మం—నేను కాలిగోరు మొదలుకొని సిగ పువ్వువఱకును బ్రభువునే నే కన్నెఱ్ఱజేసిన జగమెల్లు వడఁకునో చూడు

ఓహో! చండికా నీగడ్డము నెరసినదేల? ఛీ తుచ్ఛులు కుక్కలవలె నేమిసైచ్యములు సేసిరి, ఏమి యిచ్చకములువల్కిరి. నేచెప్పిన దానికెల్లఁ దలయూచిరే. వాన తలం దడిపినపుడు, గాలి మేను వడకించినప్పుడును పిడుగులు నామాటవినక పడినప్పుడును వాండ్ర గుట్టు నాకు స్పష్టమైనది

చం—ఏదీ! నీపాదములు సోకనిమ్ము

మం—మనుష్య వాసన గొట్టుచున్నది. తుడువనిమ్ము

చం—మహాప్రభూ! నీ కెట్టిగతి పట్టినది? నన్ను గుర్తించఁ గలవా?

నీకండ్లు నాకు బాగుగా గుర్తు తెలియును నన్ను వెక్కిరించుచుంటివా? ఈశపథమును జదువుము

చం—ఇందలి ప్రతియక్కరమును నక్కసదృశంబైనను నాకన్నులకుం గోచరంబుకాదు

మం—ఓహో! నీవా? కంటిలో గ్రుడ్డును, సంచిలోదుడ్డును లేనిదశపట్టినదా? నీకుఁ బ్రపంచస్థితి యిప్పుడు గన్పడుచున్నదా?

చం—నా జ్ఞాన నేత్రమునకుఁ బ్రపంచమిప్పదు స్పష్టముగా గోచరించుచున్నది

మం—ఆ వె చినుగువలువవాల్చు మనుజునితప్పులు
కొంచెమైనఁదోచు గొప్పఁగుచు
నరిగపట్టువల్వ ధరియించువారల
సకలదుర్ణయములు సమసిపోవు

అ వె ప్రభువు లెంతలేసి పాతకంబు లొనర్ప
ధర్మనిగ్రహమునఁ దగుల రెండు
పేరు లేనివాని నేరముల్ గనుఁగొన
నూరి ప్రముచ్చులెల్ల కూరు లరయ

ఇందెవరును దప్పు చేయలేదు ఎవ్వరిని దూషింపను ముక్కున సులోచనముల జోడు దగిలించుకొని నీటుజూపు నవనాగరికులవలె సర్వజ్ఞత్వ మభినయించు చున్నావు ఎవఁడురా నాకాలి జోడూడ్చుము

స్వే—ఆహా! ఏమీ తెలిసియు మఱపును ఈయున్మాదవివేకసమ్మేళన మేమిచిత్ర ముగా నున్నది?

మం—నిన్ను మఱువలేదు ఇంద్రసేనుఁడవుగాదా? నా దైన్యమునకు నీకు విచారము వొడము చున్నయెడ నాకన్నవ నీ కెరు విచ్చెదను నీకుం గొంతయూరట గల్గఁజేసెదఁ గాక మన మీ ప్రపంచమున జననమందునపు డేడ్చుటకుం గతంబేమో నీకుఁ దెలియునా? తెలియనిచోఁ జెప్పెద వినుము

చం—అయ్యో! దైవమా! ఈ సంసారకూపమునఁ బడవలసెఁగా యని నాకాకూతుం బ్రకును, అల్లుండ్రును నిప్పుడు చేజిక్కినం గసిమసంగ కుందునా?

[ఒక రాజపురుషుఁడును, అనుచరులను బ్రవేశించుచున్నారు]

రా—ఇదె ప్రభువు పట్టుడు మహాప్రభూ మీ ప్రియపుత్రిక—

మం—ఏమి! బందిగ్రహము ప్రాప్తమయ్యెనా? విముక్తిలేదా? ఇంతయు దైవనిర్ణయము నన్నుమాత్రము బాగుగ నాదరించిన మీకుం బారితోషిక మొసంగెద నాకు మతిభ్రంశ మగుచున్నది మంచివైద్యులను నెమకి తెండు

మహాప్రభూ! మీకేమిటం గొదువ యుండదు విచ్చేయుఁడు

మం—నేను పెండ్లికొడుకువలె యమపురికి బయలుదేరవలె నేను మహారాజు నన్నమాట మఱచిపోయినారా?

రా—చిత్తము మహాప్రభూ! యేమియాజ్ఞ

మం—ఏదీ నాపరుగు పట్టఁగలరా?

(ముందు రాజును వెంట నను చరులను బరుగిడుచున్నారు)

చం—ఎంతయల్పునియంబైనను నీదైన్యముం గన్నఁ గన్నుల నీరు గమ్ముకుండునా హా! మహారాజా యెట్టియవస్థపట్టినది? నీయిరువురు కుమార్తెలను దెచ్చిపెట్టిన యీయవస్థ నీమాడవకుమార్తె పరిహరించుఁగాత!

స్వే—అయ్యా వందనము

రా—శుభమస్తు ఏమికావలెను?

స్వే—యుద్ధముసంగతి మీరేమైన వింటిరా?

రా—ఆసంగతి మెడమైన తలయున్నవాని కెల్ల విశదమే నీకుఁ దెలియకున్నదా?

స్వే—శత్రుసేన యెంతదవ్వులనున్నది?

రా—సన్నిహితమైనది అనుక్షణమును బ్రతీక్షించుచున్నారు సుశీలా మహారాణిగారిచటఁ బనిమీఁద నున్నదేకాని యామెసేన శత్రుసేనకభిముఖమై నడచుచున్నది

స్వే—నేఁ గోరినయంశ మిదియ ఇఁక నే బనివినియెద (రాజపురుషుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

చం—దైవమా! నాకు శీఘ్రమున విముక్తి దయచేయుము భవదాదిష్టాయుః పరిమాణము సరియగువఱకును నా కొందుదుశ్చింత గల్గకుండఁ బ్రసాదింపుము

స్వే—నాయనా! ఈ మీప్రార్థన యెంతయు యోగ్యముగానున్నది

చం—అప్పా నీ వెవరవు

స్వే—కష్టములు శల్యాశల్యమునను నాటి దైన్యమన్న జాలిగలుగు హృదయము గల్గినయొక పేదసంసారిని నీచే యిటులిమ్ము నిన్నొక యిరవుచెర్చి పోయెద

చం—ఈశ్వరుఁడు నిన్ననుగ్రహించుఁగాత

(కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కు—ఓరీ దొరికితివి నీ నేత్రశూన్యమైన యీశిరము నాభాగ్యము నింపుటకు నిర్మింపబడినది దేవులిం దలఁచుకొనుము కత్తి కంఠమునఁ బడుచున్నది

చం—మిత్రమా! నన్ను రక్షించెదవు ఒక్క వేటునం దునుముము

(స్వే॥ అడ్డము సొచ్చుచున్నాఁడు)

కు—ఓరీ! దుష్టకోన నీవీ సాహసమున కేలఁ జొచ్చెదవు ప్రభుశాసనము మరల్ప నీతరమగునా? చెయి విడువవేని వానియవస్థలో నీవును భాగస్వామి వగుదువు

స్వే—స్వామీ! ఈ బీరాలు గట్టి పెట్టుము

కు—విడువుము విడువకున్న నీప్రాణములు విడువవలసె వచ్చును

స్వే—మాయామానన కేల? ఈమాటలు గట్టిపెట్టి నీత్రోవ బొమ్ము తాటాకు చప్పుళ్లకుఁ గుందేళ్లు బెదురునా? అనుగో దరికి రావద్దంటె వచ్చుచున్నావు అయితే యేఁగట్టినో నాదుడ్డుగట్టియో నీతలయో మాతము

కు—పోరా పక్షీ

స్వే—ఏ కోతలు కట్టిపెట్టు పండ్లురాల్చెదను (పోట్లాడి స్వేతకేతు కుక్షింభరుని బడగొట్టుచున్నాఁడు)

కు—ఓరీ దురాత్మా చంపితివి ఈసంగతి గైకొని నా కళేబరమునకు సంస్కార మొనర్చి నా యింగిలోని యుత్తరముల నా తూర్యములతో వచ్చు సేనానాయకుఁడగు దోషాకరున కందఁజేయుము హా! అకాలమృత్యువా! (అని చచ్చుచున్నాఁడు)

చం—అయ్యో! చచ్చినాఁడా!

స్వే—నాయనా నీవు కూర్చుండి విశ్రమింపుము వాఁడు చెప్పిన యుత్తరములు నా కుపకార కారకములు గావచ్చును వాఁడు మడిసినాడుగాని వానిచావు మరియొకని చేతనైన తృప్తిగనుండెడు. లాభా? బంధములారా! సఖలుడు మర్యాదోల్లంఘన నిందమస్తుం బొరయుచుండుఁగాత శత్రురహస్యగ్రహణమునకు వాంఛదహృదయములు భేదించు క్షతియుం గుత్తరము విప్పి చూతపని (విప్పి చదువుచున్నాడు)

మనము పరస్పరము జేసికొనిన ప్రమాణములు మఱువవలదు అతనిం దెగఁజూడ నీ కవకాశముల మెండుకొని యుండును నీకిష్టముండిన నుచితమగు స్థలమును గాలమును దొరకక పోవు ఆతనుజయము గైకొని నిరపాయముగా నిల్లుచెరువాఁడేని మనము చేయున దేమియు లేదు అతని శయనాగారమునఁ గారాగారివాసము నాకుండదప్పదు కావునఁ గరుణించి నాకా చెఱదీర్చి నీ యధీన మొనర్చి కొనుము

నీ ప్రియపత్ని యనందగు,

భవదిష్టసఖి

"చండిక"

ఆహా స్త్రీ సాహసమునకు మేర లేదుగదా! పురుషవరేణ్యుఁడగు తనభర్త ప్రాణములు దీసి నాతమ్ముని గైకొనకెట్టి మోసము సాగుచున్నది ఈ విశ్వాస ఘాతుకు లగు రాయభామ వగు నీకీయుసుకలోఁ బూడఁద్రోక్క— టెంతయు నర్హ సంస్కారము నేనీయుశనిజ్వాలోపమగు నీయుత్తరము స్వతద్వజుని కండ్లయెదుటఁ బెట్టెదను నేనిన్న జంకి నీదుర్దాత్మ్యమును గనుగొనఁగల్గు టెల్ల నాతని కాయుశ్శేష ముండుటవ లనఁగదా!

చం—రాజుమతి చలించినది నా దురదృష్టమేమోగాని నామతి రాయివలె నిశ్చలముగా నుండి యీ దురవస్థలన్నియు సమగ్రముగా గ్రహించుచున్నయది

అ వె మశక కారణంబు మరిబంధమునకు మో
క్షమునకెట్టి దుంఖ సమయములను
మఱపుఁ బొదివివిమల మలసంచలించిన
భాగ్యమంతకంటె జనులకగునె

(దూరమున రణదుందుభి ధ్వానము వినవచ్చుచున్నది)

స్వ—అల్లదె యనతిదూరంబున రణదుందుభి మ్రోయుచున్నది సినన్నిక మిత్రుని సంరక్షణలో నుంచి నేఁ బోవలసియున్నది

(నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—మాళవశిబిరము నొక గుడారము

మందారాలుఁను తల్పగతుఁడై నిద్రించుచుండ వాద్యగీతములు మందమధురమై కర్ణ రసాయనము గ సాగుచున్నవి రాచపురుషుఁడుగ అనుచరులన, బరివేష్టించు యున్నారు సుశీలయు, సుమిత్రుఁడును వైద్యుఁడును బ్రవేశించుచున్నారు ]

సుశీ—సుమిత్రుఁడా! ఆపద్బాంధవుఁడవగు నీఋణము నేనెన్ని జన్మములకైనం దీర్చుకొనఁగల్గుదునా?

సుమి—అమ్మా నాపై నీకుఁగల యీ నెనరు వలననే సద్యోంతఃకరణము వలన నేఁదిరెట్లు తీర్చివై చితివి ఇంక కొదువేమి? నేఁజెప్పిన యంశములన్నియు యథార్థము వీసమెక్కు తక్కువలు లేవు.

సుశీల—పూర్వదురవస్థాజ్ఞాపకము లగు నీజీర్ణవసనము వీడి యర్హవస్త్రముల ధరింపుము.

సుమి—అమ్మా క్షమింపుము నే నింక నజ్ఞాతస్థితి నుండినంగాని మదభీష్టములగుఁ గతిపయకార్యంబులకు భంగంబు పొసఁగుఁగావున నాకు సమ్మతమయినదనుక నీవేషమున నాయథాస్థితి యొరులకు గోచరముగానియట్లుండ నిమ్మని నిన్నొక్కవరము వేడెద ననుగ్రహింపుము

సుశీ—అట్లయినసరే అట్లు కానిమ్ము (వైద్యునితో) ప్రభువుగారెట్లున్నారు?

వై—ఇంకను నిద్రించుచున్నారు

సుశీ—క. తనయుల దుర్ణయవర్తన
మునఁ పంత్రులు నడలువీణవోలుపున మణివో
యిన యీనృపపుంగవు స్వ
స్థునిఁ జేయుత దైవ మఖిల శుభకరుఁడు దయన్

వై—అమ్మా పూర్వసుషుప్తి గలిగినది ఇఁక మేలుకొలుపుదమా?

సుశీ—శాస్త్రరుచు అనుభవమును అనుసరించి మీకుఁ దోఁచినభంగి నాచరింపుఁడు ఆయనగాత్రమున వస్త్రమాల్యాదులఁ బొందుపరచినారా?

రా పు—అమ్మ! ఆయన గాఢనిద్రాసక్తుఁడయి యుండ నాపని యొనర్చితిమి

వై—మేలుకొల్పెదము అమ్మా! నీ వీదాపున నిల్వుము ఆయన చిత్తము కలఁకఁ జేరుటకు సందియము లేదు

సుశీ—మంచిది కానిండు

వై—అమ్మా! నీ వీప్రక్కకు రమ్ము సంగీతము కొంచెము హెచ్చుమీఁద సాగింపుఁడు

సుశీ—క. ఆపఁ ఖవలు చిలువలక్రియ
నీపగిదిం జేసినట్టి హృదయవ్రణముల్
రూపఱు సిద్ధౌషధములు
నాపాలిం బొడముగాత నాభాగ్యమునన్

(అనుచు హస్తమునఁ దండ్రిమేని నిమురుచున్నది)

సుమిత్రుఁడు—ఓ సదయహృదయా!

సుశీ—కర్కశహృదయులారా! ఎంతచేసితిరి! ఆరేయి జలప్రళయమున మీ వాఁకటి ఘాతుకమృగము లుండి మొఱపెట్టినను వానిమొఱ యాలింపఁ బోవచ్చునా? తండ్రీ! అట్టియలజడిబడి నీసుకుమారప్రాణము లెట్లు నిల్వఁజాలె? కటకటా!

సీ. సకలనీతిప్రౌఢి సరిలేక మించినమతి యిదియా యిది మాన్యచరిత
అఖిలరాజన్యమాన్యపదాబ్జునకుఁ గట్టఁడగు ట్టిలా యివి ధైర్యరాశి
చటులజఁఝానిలఝంపాపతద్వృష్టి వడ మాళియా యిది భవ్యతేజ
జంబుకసూకరసర్పాదిసాహచర్యార్హ మేతను విది యమలచరిత

ఎంత శ్రీమంతునకు విధి యెంత వ్రాసె
కలిమి యొకచోట నిలకడ గాంచు టెద్ది
ప్రాణ ముండఁగఁ గడతేరి బ్రదికితిమన
రాదుబో యేరికైన ధరాతలమున.

అనే మెదలుచున్నాఁడు పలకరింపఁడు

వై—అమ్మా! నీవు పల్కరించు టెంతయు నుచితము
సుశీ—ప్రభుశేఖరా! సుఖమా నీకు?
మం—నన్ను సమాధినుండి మేలుకొల్పి నీ వెంతపాపము గట్టుకొంటివి నీవు ధన్యవు నాపాపమున నేను నారకాగ్నిం బడియుంటిని యాత్రవు లెట్లుడుగు చున్నదో సుమము.

సుశీ—అయ్యో! నన్నెఱుంగుదురా?
మం—ఎఱుఁగుదును నీవు పిశాచవవు నీ వెవ్వరి మ్యాలినాఁటితివి?
సుశీ—అకటకటా! ఎంతపెడత్రోవనున్నాఁడు!
వై—అమ్మా! మెలఁకువ పూర్ణముగా గలుగలేదు ఇంచుక తాళుము

మం—ఎక్కడనుంటిని? ఎక్కడఁ జేరితిని? ఇది పగలా రాత్రియా? నన్ను దట్టమయినభ్రమ గ్రమ్ముచున్నది శత్రువునకైన నిట్టియవస్థ రానొల్లన నేనేమి పలుకుచుంటిని? ఇవి నా చేతులేనా? సూది గ్రుచ్చిన నొచ్చునేమో చూతము దైవమా! నాయవస్థఁ దెలిసి యుపాయముం బ్రసాదింపుము

సుశీ—అయ్యా నన్ను కటాక్షముతో వీక్షించి యాశీర్వదన మొసంగుము అయ్యో నీవిట్లు ప్రణతుడవు గాఁదగునా? వలదువలదు

మం—నన్ను బరిహాస మొనర్పకుము నేను మతిపోయిన శతవృద్ధుడను విస్మై యుంకునట్లు దోచుచున్నది నీ నామతి కడుసంశయాత్మకముగ నున్నది ఎంతయోచించిన నేగట్టిన యీపుట్టములు నా కెట్టుజొప్పడినవో జ్ఞప్తికిరాకున్నది నిన్నెక్కడ నుంటిని! నేడున్న దెచట? నాకుం బోలినట్లు చెప్పెద నవ్వబోకుము నీవు మాసుశీలవు గావా?

సుశీ—ఔ నౌను తండ్రీ

మం—ఏదీ చూతము నీబాష్పములు తడిగా నున్నవా? నీవు విషమిచ్చినను త్రాగుటకు సిద్ధముగా నన్నాడను నీకు నాయెడ ప్రేమడి లేని నేనెఱుంగుదును నీతోబుట్టువులు గడుగృతఘ్నులయి నా కపకృతి యొనర్చిరి అట్టిగడవడికి నాకుం గొంతకారణ మున్నదిగాని వారి కిసుమంతయును లేదు

సుశీ—నాకుఁగూడ నేమియును లేదు తండ్రీ!

మం—ఏమి! నే నిపు డున్నది మాళవదేశమా?

సుమి—అయ్యా! కాదు నీరాష్ట్రమున నే యున్నాఁడవు

మం—నన్ను వంచింపకుఁడు.

వై—అమ్మా! నీ విఁక హృదయస్వాస్థ్యము గ్గియుండుము చూచితివా పూర్వక్రోధావేశ మెట్లడగిపోయినదో కాని వెనుకటి విషయములు జ్ఞప్తికి దెచ్చి కలతపరచు టిప్పు డెంతయు ననుచితము పూర్ణస్వస్థత చేకూరువరకు నాయనను విశ్రమింప నిండు

సుశీల—అయ్యా! దయచేసి కొంచె మిట్లు మెల్లఁగా సగిరఁగలరా?

మం—నేను పెద్దవాఁడను మతిలేనివాఁడను నాచెయ్యులను మఱచి మన్నింపుఁడు (సుమిత్రుఁడు రాజపురుషుఁడును దక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు)

రాజపురుషుడు—వర్ధమానుఁ డట్లు వధింపఁబడినది నిజమేనా?

సు—సంశయ మేల?

రా—ఇప్పు డాయన సేనలకు నాధుఁ డెవడు?

సు—చంద్రసేనుని దాసీపుత్రుఁ డని వదంతి?

రా—శ్వేతకీర్తి సుమిత్రునితో గాంధారదేశమున నున్నట్లోకప్రవాద మున్నది

సు—ప్రవాదము బహుముఖములుగా వినవచ్చెడు సేనలు సమీపించుచున్నవి ఇఁక తడయంజనదు

రా—సమరము ఘోరభంగిని సాగుచున్నది నీను భద్రమా గాత

(నిష్క్రమించుచున్నాఁడు)

సు—నాయుద్యమములను నేఁటియుద్ధము ఫలోదయకాలము సఫలమగునో విఫలమగునో

(నిష్క్రమించుచున్నాను)



శ్రీ

# మందపాల చరిత్రము

## పంచమాంకము

రంగము — కురుక్షేత్ర సమీపమున భారతశిబిరము

[దోషాకరుఁడు, మందర, పెద్దమనుష్యుఁ డొకఁడు, భటులును సూర్య ధ్వజపటములతోఁ బ్రవేశించుచున్నారు]

దో — శ్వేతధ్వజుని నిశ్చయము నిలవఁబడియున్నదో లేదో కనుగొనిరమ్ము అతని చిత్తము స్థిరము కాదు అతి సంశయాత్ముఁడై నిముసమునకొకమారాలోచన సేయుచుండు పర్యవసానముఁ దెలిసిరమ్ము (పెద్దమనుష్యుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

మం — చండిక సేవకులిపని దీక్షినట్లున్నది

దో — నాకును అదే సందేహము

మం — ప్రియమిత్రమా! నీవు నే నొనర్పంబోవు నుపకారమును గుర్తెఱుఁగుదువు గదా నే నొకప్రశ్నం బడిగెదను ఉత్తరమున్నది యున్నట్లు చెప్ప వేఁడెదను నాతోఁబుట్టువుపై నీకాదరము లేదా?

దో — గౌరవపూర్వకముగా నాదరమే కాని వేఱొండులేదు

మం — ఆమెతో పరిచయము చాలింపుము అది నాకు హృదయదాహ మొనర్చెడిని

దో — నీ కాయంత యాపంతయు వలదు అదె నీసోదరియు భర్తయు

[శ్వేతధ్వజుఁడు, చండిక, భటులును సూర్యధ్వజపటములతోఁ బ్రవేశించుచున్నారు]

చం — (స్వగతము) యుద్ధమున నపజయమయినను సైతుగాని నాతోఁబుట్టువున న్నాతనికిం బాపనోప

శ్వే — రాజు తనప్రియతమాం జేరెఁగాట మనయాధర్మపరిపాలనాపరభూతమగు ప్రతిజ్ఞను గొంత మఱచి దిగనాడి వానిఁ జేరెనని తెలియవచ్చుచున్నది నా

శౌర్య మధర్మపక్షమున నెన్నండును ప్రజ్వలింపదు కాని మాళవసైన్యములు మనరాష్ట్రి మాక్రమించుచుండె నని విన్నంతనే పౌరుషము కొంత వొడమచున్నది

దో—నీపలుకు లెంత మనోవ్యసనవంచితములుగా నున్నవి

మం—దీని కేల యింత సిద్ధాంతపూర్వపక్షములు

చం—శత్రుసేన మోసల డాసినప్పు డీగృహకల్లోలములం దలపోసికొన నేల?

శ్వే—మన సేనానాయకులతో కావలయు కార్యగతి యాలోచింతము

దో—మీరు కొల్వుకూటముం జేరుతలోకి నేను వచ్చి చేరెద

మం—సోదరీమణీ! నీవు మతోడ రమ్ము

చం—ఏల?

మం—అది యన్నభంగి లనుచితముగ తోఁచెడిని దయసేసి రమ్ము

చం—(స్వగతము) మీకౌటిల్యము నాకు గోచరించి నేను మీతో రాఁ వలను పడదు

[వారు నిష్క్రమించుచుండఁగా మారువేషముతో శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

శ్వే కీ—నీవు నాబోటిదీనునితో సంభాషింప నిచ్ఛగింతువేని క్షణము తాళుము

శ్వే ధ్వ—ఇదె వచ్చెను ఏమి నీపని?

(శ్వేతధ్వజుఁడు, శ్వేతకీర్తి తక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు)

శ్వే కీ—(ఉత్తరమందిచ్చుచు)

మ అరిం బోవు పూర్వమిందరి రవ స్వార్థంబు వీక్షించి యం
దున నీకున్ జయమైనఁ దక్షణము నన్నుం జీరఁగా బంపు బం
పిన నే వచ్చి కృపాణపాణి నయి ఎల్లిం వోరి సాధింతు దీ
నన నిన్నట్టు సమస్తమున్ ప్రణుత నానా హారవధ్యంబునన్

సమరమున నీపనిదీఱు నేని యుంకరతో నీపై జరుగుచున్నకుట్ర లన్నియు దీఱఁగలవు భగవంతుఁడు నిన్నాయుష్మంతుం జేయుగాత

శ్వే ధ్వ—నేఁ దీనిఁ జదువుకొనునంతదనుక నిలువుము

శ్వే కీ—నిలువ వలనుపడదు గాని యవసరము పట్టినపుడు నాకై భేరి మ్రోయింపుము నే వచ్చెద

శ్వే ధ్వ—అయితే సరే ఇదె నీపత్రికఁ జదువుకొనియెద (శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

[ గోపాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

దో—శత్రుసైన్యము మాపువేరిలోనున్నది ఇదె వారిం... సామర్థ్యముల వివరము జాగరూకులయి బౌకులఁ బలెంచి తెల్పించుట ... కరవుసేయుం ఒనదు

శ్వే ధ్వ—బాగసేయక యుమరసన్నాహ మొనర్చెదను (నిష్క్రమించుచున్నాఁడు)

దో—శ్వాపదీయుగను క్రీడనొండొరులపై యసూయలు సేయు సేయువ్వరికిను మాట యిచ్చితిని ఇం దెవ్వరి స్వీకరించువాఁడ ఉభయులను గ్రహింతునా? ఒకతెనా? లేక యుభయులను ద్యజింతునా? ఉభయులు సజీవులయి యుండ నంతవఱకు నెంతేను అనుభవింప వలనుపడదు అనాథను గ్రహింతునేని చంద్రక ... దండకృశానతుల్యయై మాడిపడు ఇదియునుంగాక చండికనాథునిం బ్రతిఘటించి నా యభ్యుదయము నిల్పుకొనఁజాలుటయు దుష్కరము కానిమ్ము ప్రస్తుత మీతనిసాహాయ్యసంపత్తిచే జయలక్ష్మి వడసి, పిదప నాతనిఁ దీర్ఘనోల్ల నాపెం జేపట్టెదగాక సుశీలామండపాలుర కిత్తఁడు సూపంద లంచు ననుగ్రహం బీయుద్ధము జయప్రదమయి వారలు నా చేఁ జిక్కినచో వారలం జేరుపెట్లు? నా కీదీర్ఘవిచారములతోఁ బనియేమి? కార్యంబు ధైర్యంబుతో నడుపుటయు నాపని (నిష్క్రమించుచున్నాఁడు)



రంగము—కోన కలకలము

ధ్వజతూర్యములతో సుశీలామండపాలురును వారిసైన్యములును బ్రవేశించి నిష్క్రమించుచున్నారు

[ చంద్రసేనుఁడు శ్వేతకీర్తియుఁ బ్రవేశించుచున్నారు ]

శ్వే కీ—అమ్మా! యీచెట్టునీడ నిలిచి ధర్మోజయతుఁ అని యాశీర్వదించుచుండుము నేఁ బ్రాణికి వచ్చి నిన్నుఁ జేరఁగ్గనునేని నీయోగక్షేమముల వహించెదను

దో చం—ఆయుష్మంతుఁడవై రమ్ము పొమ్ము

(శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

[ కోన కలకలము—శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు ]

శ్వే కీ—అమ్మా! కెలిటు లిమ్ము? రమ్ము పోదము రాజు పంచతుఁ బడియె రాజురుం గొమార్తెయు నభిమాతులచేఁ జిక్కిరి

చం—ఎక్కడను పోవలె ప్రమ్ముగ్గుట నీకీచోటు దవ్వదా?

సే—దేవా! మహాప్రసాదము (నిష్క్రమించుచున్నాఁడు)

[తూర్యములతో శ్వేతధ్వజుఁడు, చండిక, చందర మఱియొక
సేనానియు భటులును బ్రవేశించుచున్నారు]

శ్వే—శబాసు! ఈప్రొద్దు నీకార్యమునకు సైన్యము తోడ్పడియె. ప్రతిపంథులను బందీకృతులఁ జేసి తెచ్చితివి. వారిని నావశ మొనర్తువేని వారిసౌఖ్యమునకు మనక్షేమమునకు ననురూపమగురీతిని వారి నాదరించెదను

దో—రాజుయొక్క పలితశిరంబును ధర్మపక్షమును ప్రజలహృదయముల నాకర్షించి మనల కనర్థ మొనర్పఁ జొప్పునని యాలోచించి సుశీలామందపాలుర నేకాంతనికేతనంబున సురక్షితులుగా నొనరించితిని. వారిసంగతి విచారింప మన కిది సమయంబు గాదు

చ. పలువుర మిత్రబాంధవులఁ బాసినయమ్మలికంబు పెల్లుగం
గలన జయంబు గేవల సుఖప్రద మాట యదిత్తఱి స్వనం
బులుపయి నాతిపాపాత్ముని గ్రుంగుచు నగ్గుర వారిఁ దోగు నా
జలజము లట్లు తాపమును సౌఖ్యము నొక్కట నందుచుండెదన్

కావున పదంపడి యుక్తావసరంబున వారిపరామర్శకుం జూత్తము

శ్వే—ఓయి! ప్రకృతివర్గములోనివాఁడ వగు నీ విట్లు సమానప్రతిపత్తిపూర్వకము భాషించెద వేల? చాలు, చాలు పెద్దఱికము

సుందర—ఆతని సామర్థ్యంబులు మదుద్దేశాధీనములు. నీ వింతమాత్రము పలుకకున్న మాయభిప్రాయము లెఱిఁగిన మేలయ్యెడు. నాప్రతినిధిగా సేనల నడపి సర్వకార్యములు నిర్వహించిన యాతని నీసమానునిగా నేలఁ దెలియఁజాలవైతివి? ఇంత పేలతన ముండునే?

చం—నీ కేల నంత వేగిరపాటు? నీయధికార మేల? అతని కీర్తియాధిక్యత గన్పింప నతనిపరాక్రమము చాలదా?

మం—కాని నాయధికారముకూడ నతనిం జేరినచో నతని కీరాష్ట్రమున తుల్యుఁ డుండఁడు

చం—నిన్నుఁ జేపట్టినంగదా యతని కట్టిగౌరవము గల్గుట?

మం—ఆహా! పేకన కాడినమాటలే నిశ్చయమగుటయుఁ గల్గునగదా!

చం—నీవైఖరిఁ గనిపెట్టుచునే యుంటిని

మం—నా కేమో జబ్బుగా నున్నది కానిచో నీకుఁ దగినయుత్తర మిచ్చి యుందును ఓసరి రాజ్ఞి! నా సైన్యమును, సర్వస్వమును నన్నును నీయధీనము సేసి కొని నీయిష్టానుసారము వినియోగపరచికొనుము ఇదె సూర్యచంద్రులు సాక్షులుగ నీ యధీనము చేయుచున్నదాన

చం—అతనిం జేపట్టఁదలఁచితివా?

శ్వే ధ్వ—వలదన నీవశమా?

దో—అయ్యా! వలదన నీతలమును గాదు

శ్వే ధ్వ—ఛీ! దాసీపుత్ర, యికఁ వారించెదను

మం—(దోషాకరునకు) నీకు నేఁ జేసినప్రతిజ్ఞను భేరి మ్రోయించి చాటఁ బంపుము

శ్వే ధ్వ—నిముసము తాళుము దోషాకరా! రాజద్రోహము నాపాదించి నిన్నును ఈకుచ్చెలక్రింద వ్రాయుచు (చండికదెస జూపుచు) ఇదె నిగ్రహించు చున్నాను ప్రియమయిన మరదలా! ఈతఁ డింతకుమున్నే నా భార్యకు మాటిచ్చి యున్నాఁడు ఆమెకయి పూని నే నీప్రార్థనకడ్డము పెట్టుచు నీ కిష్టమయినచో నన్నె పెండ్లియాడు మని నిన్ను వేఁడుచున్నాన

చం—ఆహా! ఈయుపాఖ్యానము సొగసుగా నే యున్నది

శ్వే ధ్వ—దోషాకరా! నీ వాయుధపాణివై యే యున్నాఁడవు భేరి వేయించెదరు. ఈలేఖలో వివరింపఁబడిన రాజద్రోహము నిర్ధారణచేయుట కీసేనలో నొకఁ డును సన్నద్ధుఁడు గానిచో, నే నాపనికిం బూనెద ఇదె నా ప్రతిజ్ఞ,

మం—నాకు ప్రాణము మీఁదికి వచ్చినది

చం—(స్వగతము) అట్లు గానిచో నోపధుల నెవ్వరు నమ్ముదురు

దో—ఇదె నా ప్రతిశపథము నన్ను ద్రోహియను నానరాధముఁడు కేవల మృషావాదియు నీచహృదయుఁడునని ఖడ్గపాణినయి సిద్ధాంతీకరించెద ఇదె నా మాటగా భేరి మ్రోయింపుఁడు,

మం—నాకు ప్రాణము నిలుచునట్లు తోఁపదు

శ్వే ధ్వ—ఆమెను నాశిబిరమునకుఁ దోడ్కొనిపొండు భేరీమనష్యునిఁ బిలు వుఁడు (మందరను దోడ్కొనిపోవుచున్నాఁడు)

[భేరీ మ్రోయించువాఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఓరీ! భేరీ మ్రోయించి దీనిం జాటుము.

భేరీవాఁడు—(మ్రోయించి చదువుచున్నాఁడు) ఈసేనలో నేదోషాకరుఁడు ద్రోహియని వానితో ద్వంద్వయుద్ధమున గెలిచి నిర్ధారణ చేయఁజాలు క్షత్రియ సంజాతుఁడున్నచో మూఁడవతూరి యీభేరి మ్రోగినతక్షణమే వెల్వడి రావలసినదిగా రాజాజ్ఞ

దో—మ్రోయింపుము మొదటి భేరీనాదము

దో—మరల రెండవ భేరీనాదము

దో—మరల మూఁడవ భేరీనాదము

[లోపల భేరీమ్రోత—శ్వేతకీర్తి యుద్ధసన్నద్ధుఁడై భేరీ మ్రోయింపువాని మున్నిడుకొని ప్రవేశించుచున్నాఁడు]

శ్వే ధ్వ—ఆవచ్చునాతఁడెం వచ్చుచున్నాఁడో తెలిసికొనుము

భేరీమనుష్యుఁడు—ఎవఁడవు నీవు? నీపే రేది? కుల మేఁది?

శ్వే కీ—ద్రోహముచే నా పేరు మాసినదిగాని నే మార్కొనువానికిం గులమున నింపుక యుఁ దీసిపోను

శే ధ్వ—నీ వెవ్వరి మార్కొనియెదవు?

శ్వే కీ—దోషాకరునికయి యెవఁడు పోరఁజూచ్చునో వానిని

శే ధ్వ—అల్లదె అతఁడు స్వయముగా కత్తి గట్టియున్నాఁడు

శ్వే కీ—ఒరనుండి పెంకి యడిదముం గేల నమర్పుము నీయందు దోష మాపాదించి నేభాషింపఁబోవుపలుకులు నీహృదయంబునకు ములుకులయి బాధ యొనర్చినచో నీ చేతికరవాలుతోఁ బరిహరించికొనుము

ఉ ప్రాయుతరాజ్యవైభవము ప్రాభవము నృపదీయవిక్రమ
శ్రీయును జీరికిం గొనక చెప్పెద సత్యము ఖడ్గపాణినై
యీయఖిలప్రపంచమున నెయ్యెడ నీసరిద్రోహి లేఁడు తీ
క్ష్ణాయసఖడ్గధార యిది సాక్షిగఁ జెప్పెద నీవు గాదనన్

క ద్రోహివి తండ్రికి సక్కకు
ద్రోహివి దైవంబునకును ద్రోహివి మిత్ర
ద్రోహివి రాజద్రోహివి
ద్రోహివి నీ వెల్లయెడల దుష్టవిచారా

దో—సమరధర్మమును రాజనీతియు విచారించినచో నే నీకులగోత్రంబులు దెలియుపఱుపను గయ్యమునకుఁ జొరకుండుటయే యుచితము గాని నీవేష భాషలయందుఁ

దోఁచు నాగరికతఁ జూడనట్టి విలంబమునకు నామన సియ్యకొన కున్నది నాయెడల నీ వాడినపలుకు లన్నియుఁ గల్ల లని నిన్నొప్పించుటకిదె ఖడ్గముఁ బెఱుకుచున్నాఁడ చేతనయిన నిలిచి మగటిమి చూపుము

[పోరికిఁ జొచ్చుచున్నారు దోషాకరుఁడు నేల గూలుచున్నాఁడు]

శ్వే ధ్వ—కావుఁడు కావుఁడు

చం—దోషాకరా! ఏపాపనికిఁ బూనఁ నేకూడదు. వంచనచే నిన్నిందు దించి యీదుష్కృతు లింత సేసిరి

శ్వే ధ్వ—ఛీ! పిశాచమా నోరు మూయుము! మాయవేని యీజాబుతో మాయించెద దోషాకరా! చూడు మీజాబు నీ ఘోరదోషముల నెఱుకపుచ్చుచున్నది (చండిక చింపఁబోవుచున్నది) పిశాచీ చింపకుము ఇదియెల్ల నీకు విశదమే యయి యుండు

చం—అయిన నన్ను జేయువా రెవరు? నానిశ్చితమే శాసనంబుగ నుండ నన్ను శాసించువాఁ డెవఁడు?

శ్వే ధ్వ—ఛీ శాకినీ! అయితే ఇదియెల్ల నీయెఱుకతో నడచినదే

చం—పెక్కుమాట లేల? నే నెఱుఁగనిది లేదు (నిష్క్రమించుచున్నది)

శ్వే ధ్వ—ఆమె వెంటఁ జని చర్యలు గనిపెట్టుఁడు సాహసమునకుం జొరబూనును

దో—నీ వాడినదెల్ల నేఁ జేసినవాఁడ ఇంకను నేఁ జేసిన దుష్కృతములు పెక్కు గలవు కాలక్రమమున నన్నియు బయలుపడును అంతయు మించినది నేనును గతించుచున్నాఁడ కాని నాకు నీపుట్టుబూర్వములు దెలియ నెంతయు కుతూహలము గలదు తెలిపి నా వీనులకు విం దొనర్పుము

శ్వే కీ—చ. మనము పరస్పరంబును సమాహితచిత్తము లొప్ప నీకు మా
విని మము మిత్రులొనర్చుటను బ్రీతి జనించెను నాభిజాత్యమం
దున నొకవీసమం తయిన న్యూనత నాయెడ లేదు లేదు నీ
జనకునకే జనించితిని సాధ్వికి నాతని ధర్మపత్నికిన్,

గీ. దైవఘటన దలఁప దప్పక న్యాయమై
బరఁగు నుత్కటమగు పాపపుణ్య
ఫలము లీతనువునఁ బడయుజనుండు నీ
జనన మిందులకును సాక్ష్య మరయ.

దో—అన్నా! సత్యము పల్కితివి నాకు కాల మాసన్న మయినది

శ్వే ధ్వ—నాయనా! నీనడకలో నే నీయాభిజాత్యము స్ఫురించినది నీమాటలు నావీనుల కెంతయు విందొనర్చినవి నీయెడ నాకణుడును ద్వేషము లేశమును లేదని దైవముసాక్షిగాఁ బల్కెద విశ్వసింపుము

శ్వే కీ—మహాత్మా! నేనది యెఱుంగుదును

శ్వే ధ్వ—అఘా! నియజ్ఞాతవాస మెట్లు గడతివి నీతండ్రిదురవస్థ లెట్లు దెలిసితివి నాకవి సవిస్తరముగా విన కుతూహలం బయ్యెడు

శ్వే కీ—తెలిపెద నవధరింపుము నాయనుసుఖొనం బట్టిన రాజశాసనము విన్నదిమొదలు నిరంతరప్రాణభయార్తుఁడనై—అక్కటా! ప్రాణము లెంత తీపియో గాని మరణవేదనాతుల్య మగు ప్రాణభయమును బ్రతుకుణమును భరింతుముగాని ఒక్కసారి యుసుర విడచి ముక్తి గాంచ నోపముగదా అక్కడక్కడఁ దిరుగుచుం దుదకు నీచ జంతువులకైనను వెక్కసముగా నోపు వికారవేషము గైకొంటిని ఆస్థితిలో గళితమణు లగుపొమ్ములెక్కగూడుల బాలుపు వహించి రక్తధార గాయుకు రక్తనేత్రములతో మాతండ్రి నాకుం గారసించిన నే నాతని నడపుచు, ననునయాలాపంబుల నతని యాత్మహత్యాప్రయత్నంబు లుడిపితిని గాని, యది యేమిబుద్ధి మోహమో యాతనికి నన్నుం దొలిపికొనవైతి, కడకు గడియక్రిందటనే నీయుద్ధమునకు సన్నద్ధుఁడనై వచ్చుతఱిం బునర్దర్శనప్రాప్తివిషయక సంశయమునం జేసె నన్నుం దెల్పికొని పూసగుచ్చినట్లు నావృత్తాంత మెల్ల దెలిపితి ఈకథ వినునప్పుడతని యంతరంగమునం జెరిగొను ఖేదమోదము లామదుకని జీర్ణహృదయ మవియించెంగాని, ఖాతీ జేయఁబడినదేమో నాహృదయ మవియకున్నయది.

దో—ఈకథ నాహృదయమును గరగించుచున్నయది నీ విం కేమో చెప్పఁ దలఁచినట్లు నాకుఁ దోఁచినది చెప్పుము నాహృదయమును గొంత మరుడికఁ బదనుపడ వచ్చును

శ్వే ధ్వ—నాహృదయ మిదివరకే పరై పోవన్నది ఇంకను విచారకరమైన దున్నచో విరమింపుము నాగుండె తాళఁజాలదు

శ్వే కీ—హృదయహృదయమున కదియే పరమావధగా నోపునైనను మానవదుఃఖమున కొక చరమావధిలేనట్లు దోఁచుచున్నయది అపారదుఃఖపారావారమగ్నుఁడనై నేనున్న యత్తఱి నొకవృద్ధుఁ డక్కడికే తెంచి, నన్నును నాదుఃఖమును గుర్తెఱింగినవాఁడు గావున నన్నుం గౌగిలించికొని బ్రహ్మాండకటాహమును బీటలువారునట్లు పెద్దపెట్టున

నాక్రందనము సేసె, మాతండ్రి శవముపైఁబడి యేడ్చుచు, రాజు దుర్వర్తను దెల్పుచు పరవశుఁడై యుండఁగా యిక్కడ భేరి రెండుమారులు మ్రోసెను. అంతట నే బయలుదేరి వచ్చితిని

శ్వే ధ్వ—అయితే యా పెద్ద మనుష్యుఁడెవఁడు

శ్వే కీ—రాజుచే వెడల నడపఁబడియు, మారువేషమున నాయన కొల్వుఁజొచ్చి చానిసెలుసైతము సేవగించు నూడిగములు సేసిన సుమిత్రుఁడు

[రక్తముతో నెట్టునగుకత్తి చేబూని యొక పెద్దమనుష్యుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పె—రక్షింపుఁడు రక్షింపుఁడు

శ్వే కీ—ఎట్టిరక్షణగావలె?

శ్వే ధ్వ—పలుక వేల?

శ్వే కీ—రక్తముతోఁడి యాకత్తి యెక్కడిది?

పె మ—సులివెచ్చనిరక్తముతో నదె పొగ లెగయుచున్నది చూడుఁడు ఆరక్త మాపెహృదయమునుంచి వచ్చినది అక్కటా ఎంతలో నామెకు కాలము సరిపోయినది!

శ్వే ధ్వ—ఆమె యెవరు? పలుక వేల?

పె మ—అయ్యా! మీరాణి, ఆమెతోఁబుట్టువునకు విషము పెట్టి తాను కత్తివాతబడినది విషముపెట్టిన ట్లామెయే యొప్పుకొనినది.

దో—వారి ర్వురకును నాహృదయమును సమర్పణ సేసితిని మృత్యువును శీఘ్రమునఁ గూడెదము గాక

శ్వే కీ—ఇదె సుమిత్రుఁడు వచ్చుచున్నాఁడు

శ్వే ధ్వ—ఊపిరి యున్నను లేకున్నను వారల నటకుం దోడ్కొని రండు ఈశ్వరునియొక్క యీఘోరచర్యలు మనల మేఁకలను వడఁకించుచున్నవిగాని మనహృదయములకు జాలిగొలుపకున్నయవి.

(పెద్దమనుష్యుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

[సుమిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఓహో! ఇతఁడేనా సుమిత్రుఁడు ఆహా! కాలవైపరీత్యము ఈతని కసామాన్య సత్కారమైన జూప వలనుపడకున్నయది.

సు—అయ్యా! మహారాజు నన్నుఁగొనిపోవవచ్చెవాఁ డెడ?

శ్వే ధ్వ—అయ్యో! ఎంతపరాకు పడితిమి! గోపాకరా! సుశీలామందపాలుర నేమి సేసితివి? సుమిత్రుఁడా, ఈవిపరీతము చూచినావా?

[చండికామంగరల శరీరముల తేఁడుచున్నవి]

స—అయ్యో! ఏల యిట్లు?

గో—ఉభయులను నాయందు బద్ధానురాగలై యొకతె రెండవదానికి విష మిడి తాను బొడుచుకొన్నది

శ్వే ధ్వ—ఔ నట్లే వారి ముఖములఁ గన్పడు.

గో—నా కవసానము సమీపించినయది నాప్రకృతి నుల్లంఘించియైన జన్మలో నొకయుపకృతి సేయ నిశ్చయించినాఁడ కోటకు సత్వరముగా నొకని నంపుఁడు గధమత్తకుప్ప సేసి సుశీలామందపాలక చక్కఁడకు పంపియుంటిని కార్యము మించకుండ నంపుఁడు

శ్వే ధ్వ—పరుగెత్తుము పరుగెత్తుము

శ్వే కీ—ఎక్కడకు? ఎవరివద్దకు? అభిజ్ఞానపత్రి కేది?

గో—నిరుట కెంతయు నుచితములు నాకత్తి యైకొని నాసేనానియొద్దకు సత్వరమున బొమ్ము

శ్వే ధ్వ—పరుగెత్తుము (శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

గో—సుశీల నురిదీసె యామెయే యాశాభంగముచే నరిసెట్టుకొనెనని ప్రకటింప వలసినదిగా నేను వంశీయు వాలుసేసె యుత్తరువు గాసంగి సేనానియధీనము సేసె సుశీలామందపాలురకు గోటకుఁ బంపితిమి

శ్వే ధ్వ—భగవంతుడు రక్షించుగాక వీని నిటనుండితోడ్కొని చనుఁడు

(గోపాకరుని మోసికొని పోవుచున్నారు)

[సుశీలయొక్క మృతశరీరమున సందిటఁ బెట్టుకొని రజాన, శ్వేతకీర్తియు, సేనానియు మఱికొందఱును బ్రవేశించుచున్నారు]

సు—నాపోవ రేల? మీగుండెలు ఱాతఁజేయఁబడె గాఁబోలు మీనోళ్లు నా కుండిన మిన్న బీటలువారఁ రోదనసేయునా! అయ్యో, నానిక్షేప మణుగంటిపోయునే కొనయూపిరైనను లేకపోయెగా అద్ద మొకటి దీసికొనిరండు ఊపిరిపరీక్ష చేయుదము

సుమి—అకటా! నేఁడు ప్రలయదినముగాఁ గన్పట్టుచున్నది

శ్వే కీ—అట్లే తోఁచుచున్నది

సు—అమ్మా! యేటిస్వాగతము యెటుజూచినను ద్రోహమును నాశమునే కనుంబడుచున్నవి లోకోమాత్రైల ద్రోహముచే మడిసిరి

మం—అట్లు గానోపు

శ్వే కే—అయిన యాదృచ్ఛిక యాయువగు దైవకటాక్షమ్మే మాకు దెలిపి కొని సలాభము లేదు

శ్వే కీ—సత్యము నిష్ప్రయోజనమే

[సేనాని ప్రవేశించుచున్నాడు]

సే—మహాప్రభూ! దోషాకరుడు దీక్షివాడు

శ్వే ధ్వ—ఎవరి కా వింత ప్రకృతమును గూర్చి యాలోచింపవలెను

మ. వినుడీ మిత్రులు నాపుత్రులు స్వకుజను ల్వృద్ధు లవుదు ల్వాదుప్రా
గ్వని మీక్షోభము మాన్పగావలయు యత్నింపవల్ల గావింత మీ
యనఘుం(మందపాలుని జూపుచు)జేరెదుగాక యీ రాయఖిలరాజ్యంబుం
దదీయాజ్ఞలో
మన వెల్లన్నైలగంగిలారము దయామైత్రీసనాథ స్ఫుటై

గీ. శ్వేతకీర్తిసుమిత్రులు శ్వేయపవి
వేంద్రబతిష్ఠితులయి పృథ్వీభరంబు
బూనుకార్యమునందు దివానిశంబు
మాకుం దోషమ్యోదయుగాక మాన్యకరిమ.

కం. మిత్రులు నాపులు వారల
మైత్రికి నగరూపమైన మన్నగ గనుడీ
శాత్రవు లెల్లను దమతమ
శత్రుత్వఫలంబు గుడువ సమయము డాకెన్

మం—నాప్రయత్నములు నేలపాలైనవి అయ్యో! ఎంతగతి పట్టినది,

ఉ. అక్కట! జీవులు నిలనంతము లేక పరిభ్రమింపగా
నెక్కవమైతె నీవు పృథివిం జెడు దైవముకంటె కిట్టు ని
వక్కటికంబు లేక నను నాటశిప్రుల్చి చనంగ నాయమే
దిక్కతియున్న నన్నుం గడతేర్చెదువా రెవరమ్మ పుత్రికా

నాంగహింక ప్రాణము వాసిపోయె నిక నాబొందిలో ప్రాణము ఉండనోపదు

(మూర్ఛిల్లి మృతినొందుచున్నాడు)

శ్వే కీ—అయ్యో? నేలఁ గూలుచున్నాఁడు

సుమి—హృదయమా! అలిసిపో వేల

శ్వే కీ—అయ్యా! కను విచ్చి చూడుము

స—చింతలచేఁ జివికి గ్రుస్సిరాలినాఁడు ఆయన యాత్మసాఫల్యమునకు భంగము సేయకుము

శ్వే కీ—అంతా అయిపోయినది

సుమి—కా కేమున్నది ఇంకేవఱకు నిలుచుటే నా కాశ్చర్యముగఁ గన్పట్టెడు

శ్వే ధ్వ—వారిని దోడ్కొనిపొండు సుమిత్రశ్వేతకీర్తులారా! ఇఁక విచారమే మనపాలు కాటికిఁ బోవువరకును గర్గము మానదు పరమాప్తులగు మీసాహాయ్యముచే నే నీరాజ్యభారనిర్వాహణమందు గొంత యూరట గాంచెద

సుమి—నేనును నాయజమానునిపజ్జకుం బోవలె (నిష్క్రమించుచున్నారు)

శ్వే కీ—మనమిట్లు బేలపడవలదు ఐహికసుఖదుఃఖములయందు పరమార్థభ్రాంతి చేసి ఖేదమోదము లందుట పామరలక్షణము ప్రాజ్ఞుఁడు సుఖదుఃఖములను లాభాలాభములను జయాజయములను గణింపక ఫలాభిసంధి వర్జించి ధర్మ మాచరింపవలెను (ఉభయులు నిష్క్రమించుచున్నారు)

